

ఇందులో:

- పెట్టుబడిదారీ విధానంలో తీవ్రతర సంక్షోభం
- తెలంగాణా విప్లవం - భారతప్రజల కర్తవ్యం
- బల్గేరియా కమ్యూనిస్టుపార్టీ కాంగ్రెసులో కామ్రేడ్ డిమిట్రావ్ రిపోర్టు
- బూర్జువా జాతీయత

9

15-2-49





"కార్మికవర్గ నియంతృత్వమంటే, పాత సమాజ శక్తులకు, సాంప్రదాయాలకు వ్యతిరేకంగా నిరంతరం సాగించవలసిన పోరాటమే. విద్య, రాజ్యాంగ విషయాల్లోనూ, మిలిటరీ, ఆర్థిక విషయాలలోనూ అన్ని పద్ధతులను ఉపయోగిస్తూ — దౌర్జన్యంగానూ, శాంతియుతంగానూ — ఈ పోరాటాన్ని సాగించాలి. కోట్లకు కోట్ల ప్రజలయొక్క సాంప్రదాయిక అలవాట్లయొక్క శక్తి ఘోరమైన అఖండశక్తి అని మరచిపోరాదు. పోరాటంలో గట్టిపడిన ఉక్కుపార్టీ ఒకటి లేకపోతే, కార్మిక వర్గంలోని న్యాయమైనవారందరికీ ధృఢనమ్మకం గల పార్టీ లేకపోతే, ప్రజాసామాన్యముయొక్క మనస్తత్వాన్ని కనిపెట్టి ముందుకు నడుపగలపార్టీయే లేకపోతే, ఆ ఘోరసాంప్రదాయాల శక్తిని ఎదుర్కొని పోరాటం సాగించుట అసంభవం అవుతుంది"

— లెనిన్

(ప్రాబ్లమ్సు ఆఫ్ లెనినిజం - మాస్కో ప్రతి 83 పేజీ.)





మార్క్సిస్టు సిద్ధాంత పక్షపత్రిక

| సంచిక 9 | * 15-1-1949 * | వెల: ఎనిమిదణాలు |
|---|---|---|

# నిర్మాణ కృషి

కార్మికవర్గానికి అగ్రగామిదళాలూ, సంఘటిత సైనికదళాలూ అయిన మార్క్సిస్టు - లెనినిస్టు పార్టీలు నిర్మాణకృషిని బలపరచవలసిన ఆవశ్యకతను - ప్రాముఖ్యతను - ఎల్లప్పుడూ గుర్తిస్తూనే ఉన్నాయి. నిర్మాణమూ, క్రమశిక్షణా లేకపోవడం రెండో ఇంటర్నేషనల్‌కు చెందిన సోషల్ డెమాక్రటిక్ పార్టీలకే చెల్లింది. క్రమశిక్షణ లేకపోవడం పెట్టీ బూర్జువా పార్టీల యొక్క ప్రత్యేకలక్షణం. కాని మార్క్సిస్టు - లెనినిస్టు పార్టీల విషయంలో నిర్మాణమూ, క్రమశిక్షణా అత్యంతావసరం.

మార్క్సిస్టు - లెనినిస్టు పార్టీలు విప్లవకర పార్టీలు. ఒక కొత్తరకం పార్టీలు. మార్క్సిజం - లెనినిజం యొక్క బలీయమైన పునాదులపై ఆ పార్టీల నిర్మాణసూత్రాలు ఆధారపడి వుంటాయి. నిర్మాణ కృషికి సంబంధించిన పద్ధతులను అత్యంత సౌష్ఠవంగా తయారుచేయడానికి అవి ఎల్లప్పుడూ కృషి చేస్తూనే వుంటాయి. ఆయా చారిత్రక పరిస్థితులకు అనుగుణంగా వాటిని సమన్వయిస్తూ వుంటాయి. ఆనాటి రాజకీయ బాధ్యతలను సత్వరంగా నిర్వహించడానికి తగినట్లుగా వాటిని తయారుచేస్తూ వుంటాయి.

పార్టీ నిబంధనావళిలో నిర్మాణకృషికి సంబంధించిన పార్టీసూత్రాలు పొందుపరచబడి వుంటాయి. ఏఏ పద్ధతులపై పార్టీ పని చేయవలసి వుంటుందో, పార్టీని ఏవిధంగా నిర్మించవలసి ఉంటుందో, పార్టీ అంతరంగిక జీవితాన్ని ఏఏ పద్ధతులపై కట్టుబాటులో ఉంచవలసి ఉంటుందో ఆ నిబంధనలు తెలియజేస్తాయి.

ప్రజాస్వామిక కేంద్రీకరణ, చైతన్యంతో గూడిన పార్టీ అంతరంగిక క్రమశిక్షణ భావాల్లో కార్యాచరణలో ఐక్యతా, మూతాలుగట్టే పద్ధతిని త్రోసిపుచ్చుట, పార్టీలో అవకాశవాదులు దూరకుండా తగు జాగ్రత్త వహించుట, అంతరంగిక ప్రజాస్వామ్యం, మొదలైనవి పార్టీనిర్మాణ సూత్రాల్లో అత్యంత ప్రాముఖ్యత వహిస్తున్నాయి.

ఈ ప్రధాన సూత్రాల నతిక్రమించడంగానీ, వీటిని విడనాడడంగానీ, పార్టీని బలహీనపరుస్తాయి. అందువల్ల పార్టీలు విప్లవకరమైన పోరాట పార్టీలుగా ఉండడానికి బదులు ఒంటి ఎత్తుగడల నిరంకుశముఠాలుగా తయారవుతాయి.

యుగోస్లావియా పార్టీ నాయకు లవలంబించిన విద్రోహపూరిత విధానము ఇందు కొక చక్కటి నిదర్శనం. మార్క్సిస్టు - లెనినిస్టు పార్టీ సిద్ధాంతాన్ని తిరిగి మరమ్మతు చేయాలనే ట్రాట్‌స్కీ పంథానే టిటోముఠా అవలంబించింది. పార్టీ నిర్మాణ సూత్రాలను అణగద్రొక్కివేసింది. పార్టీకి ప్రధానపాత్ర లేకుండా చేసి క్రమంగా పార్టీని బలహీనపరచి చివరకు దాని అస్తిత్వాన్నే రద్దుచేయ పూనుకుంది. ఒకప్పుడు ట్రాట్‌స్కీ ముఠా చేసినట్లుగానే నేడు టిటో ముఠాకూడా పార్టీలో నాయకత్వం కోసం మిలిటరీ పద్ధతులను ప్రవేశపెడుతూ ఉంది.

యుద్ధానంతర సంవత్సరాల్లో పూర్తిగా నిర్మాణకృషినీ, రాజకీయ కృషినీ పెంపొందించడానికి కమ్యూనిస్టుపార్టీలు చాలా కృషి చేశాయి. సిద్ధాంతరీత్యా, రాజకీయరీత్యా కమ్యూనిస్టుపార్టీలు బలవత్తరమయ్యాయి. ప్రజాభిమానాన్ని చూరగొని పెద్ద పెద్ద ప్రజాపార్టీలుగా అభివృద్ధి చెందాయి.

కమ్యూనిస్టుపార్టీల నిర్మాణకృషికి రాజకీయకృషికి సంబంధించిన ఉత్తరాలను యుగోస్లావియా కమ్యూనిస్టు పార్టీకి వ్రాయడంలోనూ, యుగోస్లావియా కమ్యూనిస్టుపార్టీ పరిస్థితిని' గురించి జూన్ నెలలో జరిగిన ఇన్‌ఫ

రేషన్ బ్యూరో తీర్మానించడంలోనూ సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ ఒక విశిష్టపాత్రను నిర్వహించింది.

కమ్యూనిస్టుపార్టీలు తమ కృషిలోని తప్పులను దిద్దుకోడానికీ, తమ సభ్యులందరినీ సంఘటితంచేసి మంచి కట్టుదిట్టంగా ఉంచేందుకు సరియైన పంథా నవలంబించడానికీ, సోషలిజానికి పునాదులు వేసేందుకు ఉపకరించే లక్ష్యాలను నిర్వచించడంలో తగినంత శక్తిమంతంగా వ్యవహరించడానికీ, పల్లెల్లోనూ, పట్టణాల్లోనూ ఉన్న పెట్టుబడిదారీశక్తులను అదుపులో ఉంచడానికీ, ఆ శక్తులను తుడిచిపెట్టడానికీ ఆ తీర్మానం తోడ్పడింది.

ఈ పైన ఉదహరించిన రాజకీయ కర్తవ్యాలన్నిటినీ నిర్వహించాలంటే ఆ పార్టీల నిర్మాణకృషియొక్క స్థాయి ఎంతో పెరగవలసి ఉంటుంది. పార్టీ నాయకత్వంలో సర్వతోభివృద్ధి రావలసిఉంటుంది. విజయం ఎప్పుడూ తనంతట తానేరాదు. తీవ్రమైన పోరాటంద్వారానే విజయాన్ని సాధించవలసి ఉంటుంది.

బోల్షివిక్‌పార్టీ అవలంబించే ప్రధానపంథా జయప్రదం కావాలంటే నిర్మాణకృషికి ఎంతో అత్యంతప్రాముఖ్యత వున్నదని కామ్రేడ్ స్టాలిన్ గుర్తించాడు ఈ సందర్భంలో కామ్రేడ్ స్టాలిన్ అన్నమాట లివి:

"సరియైన పంథా నిర్ణయించబడిన తర్వాత, సమస్యను పరిష్కరించడానికి సరియైన మార్గాన్ని కనిపెట్టిన తర్వాత, పార్టీకృషి ఎంతనిర్మాణ యుతంగా కొనసాగింపబడుతుంది అనే విషయంపైనా, ఆయా పరిస్థితులకు పార్టీయొక్క పంథాను సమన్వయించడం కోసం జరిగే పోరాటంయొక్క నిర్మాణంపైనా, ఆయా స్థానాలకు తగిన వ్యక్తులను ఆయా స్థానాల్లో నియమించడంపైనా, ప్రధాన కమిటీల నిర్ణయాలు ఏవిధంగా అమలుజరుప బడుతున్నాయో వాటినిగురించి ఎప్పటి కప్పుడు చేసే తనిఖీపైనా విజయం ఆధారపడి ఉంటుంది."

"సరియైన రాజకీయ పంథా చేపట్టినతర్వాత ప్రతివిషయాన్నీ నిర్మాణ కృషియే (ఆర్గనైజేషనల్ వర్క్) నిర్ణయిస్తుంది. ఆరాజకీయ పంథాయొక్క భవిష్యత్తు, జయాపజయాలుకూడా దానిపైనే ఆధారపడి ఉంటాయి.

సోషలిజానికి పునాదులు వేయడం కోసం సాగించే పోరాటంలో ఎదుర్కోవలసి వచ్చే చిక్కులనూ, కష్టాలనూ గురించి ముందే తగినంత జాగ్రత్త వహించాలి. ఈసమయంలో వర్గపోరాటం ఇంకా తీవ్రతరం అవుతుంది అనే విషయాన్ని దృష్టిలో వుంచుకొని నూతన ప్రజాస్వామిక దేశాల్లో ఉన్న కమ్యూనిస్టుపార్టీలు తమ కమిటీలయొక్క పోరాట శక్తి

పెంపొందించుకోడంకోసం, తమ సభ్యులందరిని మంచి నిర్మాణయుతంగా సంఘటితపరచడంకోసం తీవ్రంగా పాటుపడుతున్నాయి.

అనేక నూతనశక్తులు పార్టీలోకి కొట్టుకురావడంచేత ఆ దేశాల పార్టీ సభ్యత్వం మాత్రం విరివిగా పెరిగింది. కాని ఇందువల్ల అనేక లోపాలు కూడా ఆ పార్టీలో ప్రవేశించాయి. ఆ పార్టీలయొక్క సాంఘిక సమ్మేళనలో తీవ్రమైన మార్పులు వచ్చాయి. కార్మికవర్గ సమ్మేళనను దెబ్బకొట్టి పెటీ-బూర్జువా శక్తులయొక్క ప్రాబల్యం ఎక్కువయింది. పెటీబూర్జువా శక్తులు మాత్రమే కాకుండా చివరకు బూర్జువాశక్తులూ అభివృద్ధి నిరోధక శక్తులుకూడా పార్టీలో దూరాయి. తత్ఫలితంగా కొన్ని పార్టీల కమిటీల్లో విప్లవాత్మక జాగరూకత మొక్కవోవడం మనం చూస్తూనే వున్నాం.

ఈవిధంగా పార్టీలను దిగజార్చడంవల్ల ఎటువంటి ప్రమాదాలు కలుగుతాయో తెలుసుకోడానికి ఇదొక హెచ్చరిక. హాంగేరీ, పోలండు, జకోస్లోవేకియా, బల్గేరియా, కమ్యూనిస్టు పార్టీల కేంద్రకమిటీలు యీ అనుభవాన్ని పురస్కరించుకొని పార్టీలో చేరే నూతన వ్యక్తులపై కొన్ని పరిమితులను విధించాయి. ఇప్పుడున్న సభ్యత్వాన్ని తిరిగి తనిఖీ చేయాలనీ, నూతన సభ్యులను పార్టీలోకి చేర్చుకునేముందు కొంత కాలం వారిని పరీక్షించాలనీ (ప్రొబెషనరీ పీరియడ్) నిర్ణయించాయి.

రుమేనియా కమ్యూనిస్టుపార్టీలో నాయకస్థానాల్లో వున్న సభ్యులను గురించి ఇదివరకే పరిశీలన ప్రారంభమయింది.

ఈ పద్ధతులవలంబించడంద్వారా పార్టీసభ్యుల స్థాయిని పెంపొందించడం జరుగుతుంది. రాజకీయ జాగరూకత అభివృద్ధి చెందుతుంది. పార్టీ సభ్యుల్లో కార్యాచరణ స్వభావం పెరుగుతుంది. మొత్తం పార్టీయొక్క నిర్మాణకార్యక్రమమే బలపడుతుంది.

పార్టీలయొక్క నిర్మాణ కృషిని పెంపొందించడానికి పార్టీకిమూలమైన ఫ్యాక్టరీ కమిటీలను, ముఖ్యంగా గ్రామకమిటీలను బలపరచడం అత్యవసరం. ఈ కమిటీలపైనే పార్టీకృషి ఆధారపడి ఉంటుంది. ఈకమిటీల ద్వారానే ప్రధానంగా ప్రజాసామాన్యాన్ని సంఘటితపరచడం, పల్లెప్రాంతాల రాజకీయార్థిక జీవితాన్ని సరిదిద్దడం జరుగుతుంది. కాబట్టి వీటిని బలీయంగా నిర్మించవలసి ఉంటుంది.

ఫ్యాక్టరీకమిటీల్లోనూ. ముఖ్యంగా గ్రామకమిటీల్లోనూ, ఈనాడు జరుగుతూన్న కృషి అసంతృప్తికరంగా ఉన్నదని అనేక విషయాలద్వారా స్పష్టమవుతోంది. ఇటీవల బుడాపెస్టు పార్టీ సభ్యుల సమావేశంలో కామ్రేడ్ ఫర్కాస్ ఇచ్చిన రిపోర్టునుబట్టి ధాన్యం విడుదల సందర్భంలో ధనికరైతుల పలుకుబడికి కొన్ని పార్టీకమిటీలు కొంతవరకూ, మరికొన్ని పార్టీకమిటీలు పూర్తిగానూ లొంగిపోయినవనీ ధాన్యం విడుదలకు సంబంధించిన పార్టీ పాలసీకి వ్యతిరేకంగా వ్యవహరించాయనీ స్పష్టమయింది.

పార్టీయొక్క రాజకీయ పంథాను జయప్రదంగా కొనసాగించడం ఆయా స్థానాల్లో ఆయాస్థానాలకు తగిన సభ్యులనే నియమించడం పైన ఆధారపడిఉంటుంది.

ప్రజాస్వామిక ప్రజాతంత్ర దేశాలలో కమ్యూనిస్టుపార్టీలే ఆదేశాల నిర్మాణ, నిర్వహణ బాధ్యతలను పూర్తిగా నిర్వహిస్తున్నాయి. కాబట్టి ఈ బాధ్యతలను సక్రమంగా నిర్వహించాలంటే కార్మికవర్గంనుంచీ, కష్టజీవులనుంచీ వచ్చిన తమ (పార్టీ) సభ్యులకు ముందుగా తగిన తర్ఫీదు ఇవ్వవలసి ఉంటుంది పార్టీ సిద్ధాంతాలను క్షుణ్ణంగా అవగాహన చేసుకొని పార్టీకోసం తమ సర్వస్వం ధారవోసే ఆ సభ్యులే - కష్టజీవులనుంచీ, కార్మికవర్గంనుంచీ వచ్చిన ఆ సభ్యులే పార్టీపంథాను జయప్రదంగా ఆచరణలో పెట్టగలరు.

పార్టీ సభ్యులకు శిక్షణ ఇచ్చే విషయమై ఇదివరకే చాలా కృషి జరిగింది. పార్టీకి తమ సర్వస్వం అర్పించడానికి సిద్ధంగా ఉండి తగు శిక్షణ పొందిన వేలకొలది పార్టీ సభ్యులు ప్రభుత్వ, ఆర్థిక, పరిపాలనాదిశాఖల్లో ఉన్నత స్థానాలకు తీసుకోడం జరిగింది, అయినప్పటికీ పార్టీసభ్యులకు శిక్షణ ఇవ్వడంలోనేమి, వారిని పై మెట్టుకు పంపడంలోనేమి, చేయవలసినకృషి ఇంకా చాలా ఉంది.

పార్టీసభ్యులను సరియైన దారిలో నడిపించేందుకు పార్టీనిర్ణయాలను ఎవరు ఎంతవరకు పాటిస్తూఉందీ ఎప్పటి కప్పుడు తనిఖీచేయడం అత్యవసరం. అసలు సూచన లెలాంటివో, ఆసూచనలను ఎలా అమలుపరుస్తున్నారో ఈ రెంటినీ పోల్చిచూడడమే పార్టీ సభ్యులకు సరియైన దారిచూపడం అవుతుంది.

పార్టీ, ప్రభుత్వ, ఆర్థికశాఖల యొక్క కృషిని సరిగా పరిశీలించడం వల్ల ప్రజలను పురోగమింపచేయడం, వారిని విద్యావంతులుగా చేయడం, లోపాలు రాకుండా ఎలా

చూడాలో ప్రజలకు నేర్పడం, తమదే ప్రధాన బాధ్యత అని ప్రజలచే గుర్తింపచేయడం, జరుగుతుందని సోవియట్ కమ్యూనిస్టుపార్టీ అనుభవం తెలియజేస్తోంది.

పార్టీయొక్క, ప్రభుత్వంయొక్క అన్నిదశల్లోనూ, పైనుంచి క్రింది వరకూ, తనిఖీచేయడం, అదుపులో ఉంచడం, పార్టీసభ్యు లందరినీ పనిలో ప్రవేశపెట్టడం, అనేదే అసలుసమస్య. చురుకుగా పనిచేసే సభ్యుల మీటింగులూ, సమావేశాలూ ఒక క్రమ పద్ధతిపై జరపడం, పార్టీ నిర్ణయాలను ఎంతవరకు పూర్తిచేసిందీ తనిఖీ చేయడానికీ, నిర్ణయాలను అమలు పరచేందుకు పార్టీ సభ్యులందరినీ సమీకరించడానికీ, చురుకుగా పని చేసే సభ్యుల మీటింగులూ, సమావేశాలూ తప్పకుండా జరుపుతూ ఉండడం ఉత్తమమైన పద్ధతి అని మన అనుభవమే తెలియజేస్తూఉంది.

సరియైన నాయకత్వాన్ని నిర్మించడానికి నాయకులయొక్క అనుభవం మాత్రమే చాలదు అని లెనినిజం మనకు బోధిస్తూఉంది. పార్టీప్రజలయొక్క అనుభవంతోనూ, కార్మికవర్గంయొక్క, కష్టజీవులందరియొక్క అనుభవంతోనూ నాయకుల యొక్క అనుభవాన్ని జోడించవలసి ఉంటుంది.

● మార్క్సిజంలో శిక్షణపొందిన క్యాడర్లు మాత్రమే రోజు రోజుకూ పెరిగిపోతూ ఉండే బాధ్యతలను సరిగా నిర్వహించడానికి తగిన సమర్థత కలిగిఉంటారు. కాబట్టి పార్టీ నిర్మాణకృషిని బలపరచడానికీ, పార్టీ నెదుర్కొనే సమస్యలను పరిష్కరించడానికీ క్యాడర్లను మార్క్సిజం - లెనినిజంలో సరియైన శిక్షణ ఇవ్వడం అత్యంతావసరం.

ఈ సంవత్సరం క్యాడర్లకు తగిన తర్ఫీదు ఇవ్వడానికి పార్టీకమిటీలు బాగా కృషిచేశాయి. ఆయా జాతులకూ, ఆయా ప్రదేశాలకూ, సంబంధించిన స్కూళ్ళనూ, తదితర పాఠశాలలను పార్టీలు నడిపాయి. అధ్యయన కేంద్రాల సంఖ్య పెరిగింది.

మార్క్సిజం - లెనినిజాన్ని స్వయంగా, వ్యక్తిగతంగా అధ్యయనం చేసి అర్థం చేసుకోవాలనే ఆకాంక్షకూడా పార్టీసభ్యుల్లో ప్రబలంగా ఏర్పడింది. పార్టీలు సర్వతోవ్యాప్తంగా సాగించే విద్యాబోధన ద్వారా లక్షలకొలది పార్టీసభ్యులు విద్యావంతు లవుతున్నారు.

పార్టీల్లో వచ్చిన యీ అభివృద్ధిచాలా సంతోషించదగినదే. కాని సిద్ధాంత పరిజ్ఞానాన్ని బోధించే విధానంలో - శిక్షణ యివ్వడంలో -

ఇంకా చాలా పెద్దలోపాలు జరుగుతూ వున్నాయి. ప్రధాన పార్టీ సభ్యులందరూ స్కూళ్ళల్లో పాల్గొనడం లేదు. సిద్ధాంతాలను సరిగా అధ్యయనం చేయడం లేదు. ఈ కార్యక్రమానికి ఎక్కువగా ఉపయోగించే నేర్పుగలిగిన ప్రచారకులకు యీ బాధ్యత ఒప్పగించడం ఇంకా అన్నిచోట్లా జరగడం లేదు.

పార్టీ అభివృద్ధికి ప్రధాన సంచాలక శక్తిగా పనిచేసే విమర్శ - ఆత్మ విమర్శద్వారా పనిపాటల్లో వచ్చే లోటుపాట్లను ముఖ్యంగా దిద్దుకోవలసి వుంటుంది కాని ఈ విమర్శ - ఆత్మవిమర్శ అనేది రాణించాలంటే, పార్టీకృషిని ఇంకా ముందుకు తీసుకుపోడానికి అది వుపయోగపడాలంటే, విమర్శనూ ఆత్మవిమర్శనూ అణచివేయనట్టి పరిస్థితులుడండం అందు కత్యవసరం. విమర్శ మంచిదే అని మాటల్లో అంగీకరించినా, ఆచరణలో దానిని వ్యతిరేకించేవారిని సహించగూడదు.

విమర్శ-ఆత్మవిమర్శను గురించి పదేపదే మాట్లాడే కొందరు బాధ్యతగల కార్యకర్తలే తమ స్వంతవిషయం వచ్చేటప్పటికి ఎడమొగం పెడమొగం బెట్టడం జరుగుతూవుందని ఇటీవల జరిగిన జెకోస్లోవేకియా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ విస్తృత సమావేశంలో ఆ పార్టీ నాయకులు హెచ్చరించడం జరిగింది.

కమ్యూనిస్టుపార్టీలు ప్రజలతో అత్యంత సన్నిహిత సంబంధాన్ని కలిగివున్నాయి. అసంఖ్యాకులైన కష్టజీవులయొక్క విప్లవపోరాటాన్ని నడుపుతూ వున్నాయి. వర్గసంఘర్షణ తీవ్రతరమైన నేటి పరిస్థితుల్లో సామ్రాజ్యవాదానికీ, అభివృద్ధి నిరోధక తత్వానికీ వ్యతిరేకంగా ప్రజాస్వామికంకోసం, అభ్యుదయంకోసం, సోషలిజంకోసం సాగించే పోరాటంలో ప్రజానీకాన్ని ఐక్యంచేసి సంఘటిత పరుస్తున్నాయి.

ఈ పోరాటంలో కమ్యూనిస్టు పార్టీలు పోరాట, విప్లవానుభవాన్ని గడిస్తున్నాయి. విజయం ఎలా సాధించాలో నేర్చుకుంటున్నాయి.

త్వరలోనే జరగబోతూన్న పోలండు, బల్గేరియా, జెకోస్లోవేకియా కమ్యూనిస్టుపార్టీల మహాసభలు పార్టీ నిర్మాణ, రాజకీయకృషిని

పెంపొందించడంద్వారా ఇందుకెక్కువగా తోడ్పడగలవు. పై మహాసభల చర్చనీయాంశాలలో తదితర విషయాలతోపాటు పార్టీ నిబంధనలు, పార్టీ కార్యక్రమంకూడా ఉండడం పార్టీ నిర్మాణ స్వరూపానికీ, నిర్మాణ కృషికీ అవి తగిన ప్రాముఖ్యత నిస్తూన్నట్లు ద్యోతకమవుతోంది.

నిర్మాణకృషిని ఇంకా ఉత్తమంగా ఉన్నతస్థాయిలో సాగించడం ద్వారా కమ్యూనిస్టుపార్టీలకు నిస్సందేహంగా నూతనబలం చేకూరుతుంది. వాటి పోరాటశక్తి పెంపొందుతుంది. వాటి నెదుర్కొంటూన్న రాజకీయ బాధ్యతలను త్వరితంగా నిర్దుష్టంగా నిర్వహించడంలో ఆ పార్టీలకు తగినశక్తి సామర్థ్యాలను కలిగిస్తుంది.

"ఫర్ ఏ లాస్టింగ్ పీస్, ఫర్ ఏ పీపుల్స్ డెమాక్రసీ" (15—12—1948)

"పార్టీయొక్క బలప్రతిష్ఠలు—అందులోనూ ముఖ్యంగా కమ్యూనిస్టుపార్టీ బలప్రతిష్ఠలు పార్టీసభ్యులయొక్క గట్టితనం పైనా, శ్రామికవర్గంపట్ల వారు చూపే శ్రద్ధాసక్తులపైనా, శ్రామికవర్గం సాగించేపోరాటంలో వారు ప్రదర్శించే పట్టుదల పైనా ఆధారపడిఉంటాయి. అంతేకాని పార్టీసభ్యుల సంఖ్యా బాహుళ్యంమీద అంతగా ఆధారపడి ఉండవు."

—స్టాలిన్

౧

# పెట్టుబడిదారీ విధానంలో తీవ్రతర సంక్షోభం

—ప్రొఫెసర్ ఏ. శ్నియర్సన్

మొదటి ప్రపంచ మహాయుద్ధానంతరం (1914-18) ఫలితంగా పెట్టుబడిదారీ విధానం త్వరితంగా దెబ్బతినిపోవడం ప్రారంభమయింది. పెట్టుబడిదారీ విధానంలో సర్వతోవ్యాప్తమైన సంక్షోభం బయలుదేరింది. తదాది అనేక యుద్ధాలూ, విప్లవాలూ విజృంభిస్తున్నాయి. ప్రథమ ప్రపంచ యుద్ధానికి పూర్వం ప్రపంచమంతటా ఒక్క పెట్టుబడిదారీ ఆర్థిక విధానమే ఉండేది. కాని యుద్ధానంతరంనుంచీ పెట్టుబడిదారీ ఆర్థికవిధానంతోపాటు ప్రపంచంలో మరోప్రక్కన సోషలిస్టువిధానం కూడా ప్రారంభమయింది. పెట్టుబడిదారీ విధానం ఒకవైపు నానాటికి దెబ్బతినిపోతూ తీవ్రతరమైన సర్వతోవ్యాప్త సంక్షోభానికి గురిఅవుతూఉంటే మరోవైపు సోషలిస్టు విధానం మూడు పువ్వులు ఆరు కాయలుగా అభివృద్ధిచెందసాగింది. అసలు సోషలిస్టు విధానంయొక్క అస్తిత్వమే పెట్టుబడిదారీ విధానంయొక్క అవకతవకలనూ, అక్రమాలనూ, అన్యాయాలనూ విస్పష్టంగా ప్రదర్శిస్తుంది. పెట్టుబడిదారీ విధానంయొక్క పునాదులనే ఊపివేస్తుంది.

వలసదేశాల్లోనూ, పరాధీన దేశాల్లోనూ ఉన్న సామ్రాజ్యవాద మూలాధారం సోవియట్ విప్లవ విజయంతో సమూలంగా కదిలిపోయింది. ఆదేశాల్లో సామ్రాజ్యవాద ప్రతిష్ఠ దెబ్బతిని పోయింది. వెనకటిలాగా ఇక సామ్రాజ్యవాదం ఆ దేశాల్లో తన పెత్తనం చలాయించలేదని రూఢిగా తేలిపోయింది.

ప్రథమ ప్రపంచయుద్ధ సంవత్సరాల్లోనూ, తదనంతర సంవత్సరాల్లోనూ వలసదేశాల్లో స్థానిక పెట్టుబడిదారీ విధానం తలఎత్తి అభివృద్ధికా జొచ్చింది. పాత పెట్టుబడిదారీ దేశాలతో ఇప్పుడాదేశాలు సరిసమానంగా పోటీచేస్తున్నాయి. ఇందువల్ల మార్కెటు కోసం పెట్టుబడిదారీ దేశాలమధ్య జరిగే పోరాటం ఇంకా తీవ్రతరమయింది.

మొదటి ప్రపంచ యుద్ధఫలితంగా పెట్టుబడిదారీ దేశాల్లోని పరిశ్రమల నిర్వహించడానికి కావలసిన శక్తిలో తీరనిలోంత ఏర్పడింది. రిజర్వుసైన్యాలనుంచి లక్షలకొలది యువకులు నిరుద్యోగులుగా మారడం తటస్థించింది. ఈ నిరుద్యోగసమస్య పెట్టుబడిదారీ

దేశాలకు కొరకరాని కొయ్యగా తయారయింది.

గుత్తపెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందడంతోపాటు పెట్టుబడిదారీ విధానం యొక్క సర్వతోవ్యాప్తసంక్షోభం ఇంకా తీవ్రతరమయింది. గుత్త పెట్టుబడిదారీవిధానం అభివృద్ధి చెందడమంటే ఆర్థికంగా, రాజకీయంగా పెట్టుబడిదారీ విధానం అసమానంగా అభివృద్ధిచెందడమే.

సామ్రాజ్యవాదమంటే గుత్తపెట్టుబడిదారీ విధానం. పదివేలమంది కార్మికులకుపైగా పని చేసే అమెరికాలోని భారీపరిశ్రమలు ఒక్కొకటి యుద్ధానికిపూర్వం నూటికి 13.1 వంతులనుంచి యుద్ధానంతరం నూటికి 30 వంతులవరకూ అభివృద్ధి చెందింది. ద్వితీయ ప్రపంచ మహాయుద్ధసమయంలోనూ, తదనంతరమూ ఆ యుద్ధఫలితంగా అభివృద్ధిచెందిన గుత్తవిధానం పెట్టుబడిదారీ విధానంలోని సంక్షోభాన్ని మరింత తీవ్రతరంచేసింది.

గుత్తపెట్టుబడి ప్రభుత్వంతో మిళితమైపోయిన ఫలితంగా దానిపుణ్యమాఅంటూ గుత్తపెట్టుబడులు బాగా బలపడ్డాయి. ముఖ్యంగా ప్రభుత్వ పెట్టుబడులద్వారానే పెట్టుబడులూ, లాభాలూ పెరిగిపోయాయి. ద్వితీయ ప్రపంచ యుద్ధసమయంలో అమెరికా పరిశ్రమల్లో పెట్టిన మొత్తం పెట్టుబడుల్లో అయిదువంతులకు నాలుగువంతులు ప్రభుత్వంనుంచి వచ్చిన పెట్టుబడే. విపరీతంగా ప్రభుత్వం సహాయం చేయడంవల్ల లాభాలు కూడా కుప్పతిప్పలుగా వచ్చాయి. యుద్ధసమయంలో అమెరికా ప్రభుత్వం ఇచ్చిన ఆర్డర్లలో నూటికి 75 వంతులు అమెరికాలోఉన్న వంద పెద్ద కంపెనీలవే. అమెరికా ప్రభుత్వధనంతో నూతనంగా నిర్మించిన ఈ భారీగుత్తపరిశ్రమల చేతుల్లోనే మొత్తం నికరపు పెట్టుబడిలో నూటికి 79 వంతులుంది.

ఈ విధంగా తదితర సమయాలన్నిటికంటె ఎక్కువగా యుద్ధసమయంలో గుత్తవ్యాపార సంస్థలు తమ స్వార్థలాభంకోసం తమపోటీదార్లను అణగగొట్టడంకోసం, కార్మికవర్గాన్ని దోచుకోడంకోసం, ప్రభుత్వ ఖజానాను బాగాఉపయోగించుకున్నాయి.

అసమానంగా రాజకీయార్థికాభివృద్ధి జరగడమనే పెట్టుబడిదారీ విధానంయొక్క సూత్రం ప్రపంచ పునర్విభజనకోసం పోరాటానికి దారితీస్తుంది. మార్కెటుకోసం జరిగే పోరాటాన్ని తీవ్రతరం చేస్తుంది. ఇతర పెట్టుబడిదారీదేశాలకంటె అమెరికా చాలా ముందుకు సాగిపోవడంలోనే ఈ అసమానత్వం ద్యోతకమవుతుంది. అమెరికాకు తదితర పెట్టుబడిదారీదేశాలకు మధ్యనున్న భేదం యుద్ధసమయంలో బాగా హెచ్చింది. పెట్టుబడిదారీ ప్రపంచంయొక్క మొత్తం పారిశ్రామికోత్పత్తిలో అమెరికాభాగం నూటికి 40 వంతులనుంచి 60 వంతులవరకు పెరిగింది.

యుద్ధకాలంలో కెనడా, ఆస్ట్రేలియా, దక్షిణ అమెరికాదేశాలు మొదలైన దేశాల్లో పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందింది. కెనడాదేశంలోని ఇనుము, ఉక్కుపరిశ్రముల నేటి ఉత్పత్తిశక్తి యుద్ధానికి పూర్వం ఫ్రాన్సుతో సరిసమానంగాఉంది. అనేక ల్యాటిన్ అమెరికాదేశాలుకూడా యుద్ధకాలంలో తమ పారిశ్రామికోత్పత్తిని తగినంతగా పెంచుకున్నాయి. అసమానంగా, హెచ్చుతగ్గులుగా జరిగే అభివృద్ధి ఫలితంగా మార్కెటు సమస్య ఇదివరకెన్నడూ లేనంత తీవ్రంగా విషమించింది.

ఈవిధంగా సామ్రాజ్యవాదంలో ఉన్న పరస్పరవైరుధ్యాలు తీవ్రతరమైనకొలదీ పెట్టుబడిదారీ విధానంలోని సర్వవ్యాప్త సంక్షోభం కూడా ఇంకా తీవ్రదశకు పరిణమిస్తుంది. "సామ్రాజ్యవాదం; పెట్టుబడిదారీ విధానం యొక్క అత్యున్నతదశ" అనే సుప్రసిద్ధ

గ్రంథాన్ని లెనిన్ వ్రాసినప్పుడు బ్యాంకులు తదితర భారీపరిశ్రమల్లోనే గుత్తపారిశ్రామికాధికారం ప్రధానంగా చలాయింపబడుతూ ఉండేది. ఆభారీపరిశ్రమల్లోకూడా ముఖ్యంగా ముడిఇనుము, బొగ్గు, నూనె వగైరా భూగర్భ (ఎక్స్ట్రాక్టివ్) పరిశ్రమల్లోనూ, చేతి పరిశ్రమల్లో (మాన్యుఫేక్చరింగ్) కొంతవరకూ గుత్తాధికారంక్రింద ఉండేవి. కాని తర్వాత ఈ గుత్తాధికారం వివిధ పారిశ్రామిక శాఖలన్నిటికీ వ్యాపించింది. చిన్నచిన్నపరిశ్రమలూ, ఆహారపదార్థాలకు సంబంధించిన పరిశ్రమలు కూడా గుత్తాధికారం చేతిక్రిందకు వచ్చాయి. వ్యాపారంకూడా — ఒక్క టోకువ్యాపారమే కాకుండా చిల్లరవ్యాపారంకూడా — ఒక గుత్తవ్యాపారంగామారింది. ఒకరూపంలోనో, మరోరూపంలోనో, వ్యవసాయంకూడా గుత్త వ్యాపారంగా తయారయింది. వీటి అన్నిటి ఫలితంగా పెట్టుబడిదారీ విధానంలో ఉన్న పరస్పరవైరుధ్యాలు మరింతతీవ్రతరమవుతాయి. ఈవిధంగా ఫైనాన్సు పెట్టుబడి కార్మికులనూ, రైతులనూ ప్రత్యక్షంగా దోపిడిచేయడమే కాకుండా బస్తీల్లోఉండే పెటీ బూర్జువా వర్గాన్నికూడా ప్రత్యేక్షంగా దోపిడిచేస్తుంది.

కార్మికులమధ్య, రైతులమధ్య దృఢమైన సన్నిహిత సంబంధం ఏర్పడడానికీ, పల్లెల్లో ఉండే అసంఖ్యాక కష్టజీవి ప్రజానీకాన్ని బస్తీల్లో ఉండే పెటీ బూర్జువా వర్గాన్ని కార్మికవర్గం తనచుట్టూ సమీకరించుకోడానికీ, ఫైనాన్సు పెట్టుబడికీ, దాని ప్రభుత్వ యంత్రానికీ వ్యతిరేకంగా కష్టజీవుల మధ్య గాఢమైన ఐక్యత నెలకొనడానికీ ఈ విధంగా అనుకూల భౌతిక పరిస్థితు లేర్పడుతున్నాయి.

పెట్టుబడిదారీవిధానం సర్వవ్యాప్తసంక్షోభానికి గురికావడమనేది కొన్ని ప్రత్యేకదశలగుండానే జరుగుతుంది.

పెట్టుబడిదారీ విధానంయొక్క సంక్షోభ గతిలో రెండు ప్రపంచయుద్ధాలూ రెండు మైలురాళ్ళవంటివి. అవి యుద్ధాలకూ, విప్లవాలకూ ఆందుచుట్లు (రౌండ్సు) లాంటివి.

పెట్టుబడిదారీవిధానం ఏవిధంగా నానాటికి అధ్వాన్నమై పోతూఉందో మనం పరిశీలించేటప్పుడు పెట్టుబడిదారీ, సోషలిస్టు శక్తుల సంబంధాల్లో ఎంతటి తీవ్రమయిన మార్పు వచ్చిందో చూడవలసి ఉంటుంది.

గతయుద్ధంలో సోవియట్ యూనియన్ ప్రధానపాత్ర నిర్వహించింది అనేది ఈ పరిశీలనలో మనకు మొట్టమొదట కనిపించే విషయం. సోషలిస్టు విధానంయొక్క ఆర్థిక సైనిక, నైతిక, రాజకీయ విశిష్టత యుద్ధకాలంలో మనకు స్పష్టంగా గోచరించింది. ఒకవైపు యుద్ధం జరుగుతూ ఉండగానే మరోవైపు తన ఉత్పాదక శక్తులనుకూడా సోవియట్ యూనియన్ వృద్ధిపరుచుకుంటూనేఉంది. యుద్ధం ముగిసిన వెనువెంటనే యుద్ధకాలంలో దెబ్బతిన్న తన ఆర్థిక విధానాన్ని పునర్నిర్మించుకోగలిగింది.

వ్యవసాయోత్పత్తిలోనూ, పారిశ్రామికోత్పత్తిలోనూ సోవియట్ యూనియన్ 1947 ఆఖరుకే యుద్ధకాలానికి పూర్వం (1940) ఉన్న స్థాయికి చేరుకుంది. సోవియట్ భూములు రణరంగాలు గామారాయి. యుద్ధంవల్ల సోవియట్‌భూమి ఎంతో నష్టపడింది. అయినప్పటికీ సోవియట్ యూనియన్ అన్ని దేశాలకంటే ముందుగానే తన ఆర్థికస్థితిని చక్కబెట్టుకో గలిగింది. ఆహారపదార్థాలపైనా, పారిశ్రామిక వస్తువులపైనా రేషనింగును తొలగించివేసింది. నోట్ల

చలామణిని అదుపులో ఉంచింది. యుద్ధం సమాప్తి చెందడంతో దేశమంతటా బలమైన జాతీయార్థిక విధానము అభివృద్ధి చెందింది. యుద్ధానంతరం జరిగిన పారిశ్రామికాభివృద్ధిలో ఈవిషయం స్పష్టంగా గోచరిస్తుంది.

1946 వ సంవత్సరం మొదటి మూడు మాసాలతో పోల్చిచూస్తే 1947 వ సంవత్సరం మొదటి మూడుమాసాల్లో సోవియట్ యూనియన్‌లో పారిశ్రామికోత్పత్తి నూటికి 12 వంతులు అభివృద్ధి అయింది. 1947 వ సంవత్సరం రెండవ త్రైమాసికంలో 1946 రెండవ త్రైమాసికంకంటె నూటికి 18 వంతులు పెరిగింది. మూడవ త్రైమాసికంలో నూటికి 26 వంతులు, నాలుగవ త్రైమాసికంలో నూటికి 30 వంతులూ అభివృద్ధిచెందింది. 1947 మొదటి త్రైమాసికంకంటె 1848 మొదటి త్రైమాసికంలో నూటికి 32 వంతులు వృద్ధిఅయింది. రెండవ త్రైమాసికంలో నూటికి 24 వ వంతులు పెరిగింది.

ఈవిధంగా సోషలిస్టు ఆర్థిక విధానం యొక్క గొప్పతనాన్ని సోవియట్ యూనియన్ మరోసారి యావత్ప్రపంచానికీ చాటి చెప్పింది.

సోవియట్ యూనియన్ యొక్క అంతర్జాతీయ ప్రతిష్ఠ, గౌరవమూ, పలుకుబడీ విపరీతంగా హెచ్చాయి. యుద్ధంలో సోవియట్ యూనియన్ విజయాన్ని సాధించడానికి కారణం రష్యా జాతీయ సాంప్రదాయాలూ, సోవియట్ ప్రజల ధైర్యసాహసాలూ మాత్రమేకాదనీ, సోషలిస్టు ఆర్థిక విధానమూ, సోషలిస్టువిధానం నిర్మించిన ప్రజాఐక్యతా సోవియట్ యూనియన్ విజయానికి ప్రధాన కారణాలని ప్రపంచ ప్రజలందరూ— అమెరికా ప్రజలతో సహా — అంగీకరించక తప్పదు.

పెట్టుబడిదారీ, సోషలిస్టుశక్తుల సంబంధాల్లో వచ్చినమార్పుకు రెండో కారణం ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం ప్రజాస్వామిక ప్రజాతంత్రదేశా లేర్పడడం. సోవియట్ యూనియన్ తోడ్పాటువల్ల ఈదేశాలు ఫాసిజాన్నుంచి విముక్తిచెందాయి. భూస్వామ్య, బడా పెట్టుబడిదారీ వర్గాలను రద్దుచేశాయి. సోషలిస్టు పంథాపై అభివృద్ధి వైపు పురోగమిస్తున్నాయి. రైతులతో ఇతర కష్టజీవులైన ప్రజాసామాన్యానికి నాయకత్వం వహించి నడుపుతోన్న కార్మికవర్గమే ఈదేశాల ప్రభుత్వాధికారానికి మూలాధారంగా ఉంది. రైల్వేలు, బ్యాంకులు, తదితర భారీపరిశ్రమలు జాతీయం చేయబడ్డాయి. ఈవిధంగా సోషలిస్టు ఆర్థిక విధానమే ఈ దేశాల ఆర్థికజీవితానికి ప్రధాన ప్రాతిపదికగా ఏర్పరచబడింది.

పెట్టుబడిదారీ విధానంనుంచి ప్రజాస్వామిక ప్రజాతంత్ర దేశాలు బైటబడడంతో పెట్టుబడిదారీ విధానంయొక్క పరిస్థితి అనేక విధాల ఇంకా అధ్వాన్నంగా మారింది. పెట్టుబడిదారీ విధానంయొక్క సర్వవ్యాప్త సంక్షోభం ఆర్థికంగా మరింత తీవ్రంతరమయింది. సామ్రాజ్యవాదుల గుత్తవ్యాపారానికి ఉపయోగపడే కొన్ని మార్కెట్టులనూ, తమ పెట్టుబడి పెట్టడానికి అవసరమైన మరికొన్ని ప్రదేశాలనూ సామ్రాజ్యవాదులు కోల్పోయారు. ఈదేశాలన్నీ మొదట ఫ్రాన్సుతోనూ, తర్వాత బ్రిటన్‌తోనూ, తుదకు జర్మనీతోనూ అనేక యుద్ధ సంబంధాలతో

ముడిబడి ఉన్నాయి. ఈ దేశాలిప్పుడు ప్రజాస్వామిక ప్రజాతంత్ర దేశాలుగా మారడంవల్ల సామ్రాజ్యవాదుల చేతుల్లో ఉన్న కొన్ని కీలక స్థానాలెగిరి పోయ్యాయి. ఈదేశాలన్నిటినీ ఇదివరకు సామ్రాజ్యవాదులు సోవియట్ కు వ్యతిరేకంగా ఒక 'రక్షణవలయం'గా అతి నీచస్థితిలో అట్టిపెట్టారు. కాని ఇప్పుడా దేశాలే సామ్రాజ్యవాద వ్యతిరేక శిబిరంలో ప్రధానపాత్ర వహిస్తున్నాయి.

యుద్ధానంతరం వలసదేశ విధానంలో కూడా ఎంతటి తీవ్రసంక్షోభం బయలుదేరిందో ఆయా దేశాల్లో జరుగుతూన్న ఘటనలే విశదం చేస్తున్నాయి. యుద్ధాలయొక్క, విప్లవాలయొక్క రెండోవరస (రౌండ్) తిరుగుతూన్న సమయంలో సాయుధపాణులై పోరాడి విదేశీసామ్రాజ్యవాద బానిసత్వం నుంచి విముక్తి పొందగలమని వలసదేశప్రజలు ప్రపంచానికి చాటారు. చైనా ఇండోనేసియా, వీత్ నాంలో జరుగుతూన్న పోరాటాలే ఇందుకు నిదర్శనం. సామ్రాజ్యవాదం ఏవిధంగా తన కొనకటివేళ్ళతో సహా కూలిపోతూఉందో పై విషయాలు స్పష్టంచేస్తున్నాయి. సామ్రాజ్యవాదం పైకికనపడే అంత బలవత్తరంగాలేదని వలసదేశప్రజలు స్వయంగా తమ కండ్లారా చూడగలుగుతున్నారు.

వలసదేశాల్లో కూడా ఆయా వర్గాల స్థానాలుమారాయి. ముఖ్యమైన వలసదేశాల్లోనూ, అర్ధవలస దేశాల్లోనూ పారిశ్రామికాభివృద్ధి ఫలితంగా నానాటికి బలపడుతూన్న ప్రజాస్వామిక ఉద్యమాన్నీ, కార్మిక వర్గంయొక్క పెరుగుదలనూ చూచి బడాబూర్జువావర్గం సామ్రాజ్యవాద శిబిరంలోకి గంతువేసింది. అభ్యుదయకర, విప్లవకర పాత్రను నిర్వహించడం మానివేసింది. కార్మికవర్గమే జాతీయ విముక్తి ఉద్యమాన్ని నడిపేందుకు నడుంగట్టింది. సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా జరిగే పోరాటంలో ప్రజలందరినీ సమీకరించవూనుకుంది. జాతీయ విముక్తి ఉద్యమానికి కార్మికవర్గమే నాయకత్వం వహించి నడపడమనేది వలస దేశాల వర్గశక్తుల్లో వచ్చిన ప్రధానమార్పు.

కార్మికవర్గం తనతోపాటు కష్టజీవులైన ప్రజలందరియొక్క విముక్తిని సాధించి అంతటితోనే ఆగిపోయే వర్గంకాదు. సోషలిస్టు సమాజ నిర్మాణానికి కూడా పూనుకుంటుంది. చైనా, ఇండియాలాంటి వలస, అర్ధవలసదేశాల్లో సామ్రాజ్యవాదులకు చెందిన పరిశ్రమలను జాతీయం చేయడమే కాదు; వాటితోపాటు స్వదేశీ బడా పెట్టుబడిదారీ వర్గంయొక్క పరిశ్రమలనుకూడా జాతీయం చేయవలసిన సమస్య ఎదుర్కొంటూంది. దీనితోపాటు ప్రజాస్వామిక ప్రజాతంత్రానికి ముఖ్యలక్షణమైన 'దున్నేవారికే భూమి' అనే నినాదంకూడా ప్రాముఖ్యత వహిస్తోంది.

మొత్తంమీద సారాంశమేమిటంటే: ద్వితీయ ప్రపంచ యుద్ధసమయంలో సోవియట్ యూనియన్ ప్రతిష్ఠ అత్యధికంగా పెరగడం, ప్రజాస్వామిక ప్రజాతంత్రదేశాలు వృద్ధిచెందడం, సామ్రాజ్యవాద వలసదేశ విధానంలో సంక్షోభం తీవ్రతరం కావడం, – ఇవన్నీ ప్రజాస్వామిక శిబిరంయొక్క బలాధి

కృతనూ, సామ్రాజ్యవాద శిబిరంయొక్క బల హీనతనూ స్పష్టంగా తెలియజేస్తున్నాయి.

*  *  *

యుద్ధంలో జర్మనీ, జపాను, ఇటలీ ఈ మూడు పెద్ద సామ్రాజ్యదేశాలు పూర్తిగా ఓడించబడ్డాయి. తమ పోటీదార్లయొక్క ఓటమికి ఇంగ్లాండు, అమెరికాలు సంతోషిస్తాయిఅని ప్రతివారూ సహజంగా ఆశిస్తారు. కాని అసలు వాస్తవంగా ఇప్పుడు జరుగుతూన్నదేమిటి? ఆదేశాలు రెండూ అందులోనూ ముఖ్యంగా అమెరికా సామ్రాజ్యవాదం జర్మనీ జపాన్ దేశాల్లో మళ్ళీ యథాతథంగా పెట్టుబడిదారీ విధానాన్నీ, సైనికవిధానాన్నీ (మిలిటరిజం) నెలకొల్పడానికి తన శర్వశక్తులూ ఒడ్డి ప్రయత్నిస్తుంది.

జర్మనీ, ఇటలీ, జపాను ఈ మూటికూటమి అభివృద్ధినిరోధక ప్రపంచ పెట్టుబడిదారీ విధానంలో ప్రధానపాత్రధారిగా ఉండేది. అందువల్లనే ఈకూటమిని మళ్ళీ యథాస్థానంలో నిలబెట్టడానికి ఆంగ్లో - అమెరికా సామ్రాజ్యవాదులు అంతగా తహతహ లాడుతువ్నారు. యుద్ధంలో జర్మనీ, జపాన్, ఇటలీలు పూర్తిగా ఓటమి చెందిన ఫలితంగా ప్రపంచాధిపత్యంకోసం ప్రాకులాడే పెట్టుబడిదారీ ప్రభుత్వాల సంఖ్య తగ్గిపోవడమే కాకుండా ప్రపంచాభివృద్ధి నిరోధకతత్వానికి అసలు మొనగా ఏర్పడిన కూటమి దెబ్బతినిపోవడం జరిగింది. పెట్టుబడిదారీ విధానానికి ఇదొక పెద్దదెబ్బ.

యుద్ధంఫలితంగా బ్రిటన్, ఫ్రాన్సులు బలహీనమయ్యాయి. అగ్రరాజ్యాలస్థానంనుంచి ఫ్రాన్సు అసలే దిగజారిపోయింది. ఆంగ్లో - అమెరికా సామ్రాజ్యవాదులు ఫ్రాన్సును రెండోరకానికి చెందిన దేశంగా పరిగణిస్తున్నారు. ఇక బ్రిటనకూడా విదేశాల్లో తాను పెట్టిన మొత్తం పెట్టుబడిలో సగం కోల్పోయింది. ఆర్థికచిక్కులతో నేడు నానావస్థ పడుతూఉంది, వలసదేశాల విస్తీర్ణత ఇంకా బ్రిటన్‌కే హెచ్చుగాఉన్నా ఆర్థికంగా అది చాలా బలహీనపడిపోయింది. ఆర్థికరంగంలోనూ సైనికరంగంలోనూ అమెరికా బ్రిటన్‌ను చాలా మించిపోయింది. వర్తకనౌకల్లోనూ, నౌకాబలంలోనూ అమెరికాకంటె బ్రిటన్ ఈనాడు ఎంతో వెనకబడిఉంది.

బ్రిటన్, ఫ్రాన్సులు బలహీనపడడంఅంటే పెట్టుబడిదారీ ఆర్థికవిధానం మొత్తానికే పెద్ద దెబ్బ అన్నమాట. బ్రిటన్, ఫ్రాన్సులు పెట్టుబడిదారీ దేశాల్లో పురాతన దేశాలు. అనేక శతాబ్దాల పర్యంతం పెట్టుబడిదారీ ప్రపంచానికి లండన్, ప్యారిస్ పట్టణాలే ప్రధాన ఆర్థిక, వర్తక కేంద్రాలు. ఈ నాటికీ బ్రిటన్ ఫ్రాన్సులక్రిందనే వలసదేశాలెక్కువగా వున్నాయి. ఈ రెండుదేశాలూ బలహీనపడడమంటే వలసదేశాల్లో సామ్రాజ్యవాదంయొక్క స్థానం దెబ్బతినిపోవడమే.

రెండో ప్రపంచ యుద్ధఫలితంగా అమెరికా వుత్పత్తిశక్తులు నూటికి 25 - 50 దాకా పెరిగాయి. సైనికబలాన్నికూడా అమెరికా విపరీతంగా పెంచింది. అమెరికా సైనికబలం యుద్ధానికిపూర్వం వున్నదానికంటె నేడు పదిరెట్లు ఎక్కువగావుంది. అంటే దీన్నిబట్టి అమెరికాలో పెట్టుబడిదారీ విధానం ఒక సాంఘిక విధానంగా బలపడిందని ఎవరూ భావించరాదు.

యుద్ధకాలంలో అమెరికా వుత్పత్తిశక్తి అభివృద్ధి అయింది అంటే విదేశీమార్కెట్టుపై అది ఎక్కువగా ఆధారపడవలసివచ్చిందన్న మాట. 'ట్రూమన్ సిద్ధాంతం'లోనూ 'మార్షల్ ప్రణాళిక'లోనూ ప్రతిబింబించే సత్యమిదే. అమెరికాచేసే మొత్తం పారిశ్రామికోత్పత్తిలో ఇదివరకు నూటికి 90 వంతులు అమెరికాలో

ఖర్చయ్యేది. మొత్తం ప్రపంచంనుండి అమెరికా పెట్టుబడిదారీవిధానం వేరుపడి వుండగలదనీ, దానికి విదేశాల్లో మార్కెట్లు అవసరంలేదనీ ఆరోజుల్లో అమెరికా గప్పాలు చెప్పుకున్నా కొంత చెల్లుబడి అయింది. కాని నేడు యుద్ధానికి పూర్వంకంటె విదేశాలకు ఎక్కువ ఎగుమతి చేస్తూవుంది; యుద్ధానికి పూర్వం మొత్తం ప్రపంచ ఎగుమతుల్లో నేడు ఒక్క అమెరికా చేసే దిగుమతులే దాదాపు సగానికి వున్నాయి. అంటే అమెరికా విదేశీ మార్కెట్టులమీదనే ఎక్కువగా ఆధారపడుతుందని స్పష్టమవుతుంది. సామ్రాజ్యవాద అమెరికాలో ఒక 'విశిష్టత' వుందని చేసే ప్రచారం అంతా వట్టి బూటకమని తేలిపోతుంది. మార్కెట్టులకోసం, పెట్టుబడి పెట్టడానికి అవసరమైన ప్రదేశాలకోసం అమెరికా బాహాటంగా దురాక్రమణ యుద్ధాలకు తలపడుతూవుంది.

అమెరికా పెట్టుబడిదారీ విధానంలోవున్న పరస్పర వైరుధ్యాలు ఇందువల్ల స్పష్టంగా బోధపడతాయి. రెండు ప్రపంచ యుద్ధాల మధ్యకాలంకంటె నేడు వుత్పత్తిశక్తులను పూర్తిగా వుపయోగించుకోలేక పోవడం, అనేకమంది శాశ్వతంగా నిరుద్యోగసమస్యకు గురికావడం అమెరికాలో స్పష్టంగా గోచరిస్తుంది.

ఈ పరస్పర వైరుధ్యాలను కప్పిపుచ్చుకోడానికి అమెరికా సామ్రాజ్యవాదం నిలవ పెట్టుబడియొక్క అభివృద్ధినీ, ఆయుధోత్పత్తి పెరుగుదలను వుపయోగించుకుంటూ వుంది. అమెరికా పెట్టుబడిదారీ విధానంలో ఒక 'ప్రత్యేకత' ఒక 'విశేషత' వుంది అని చెప్పే సిద్ధాంతంయొక్క బండారం అంతా నేడు నగ్నంగా బైటబడుతూవుంది. అమెరికాలో ఆర్థికబలం, సైనికబలం అభివృద్ధిచెందడంతో పెట్టుబడిదారీవిధానం తనకు కలిగిన నష్టాన్ని భర్తీచేసుకున్నదని కొందరు అనుకుంటున్నారు. కాని ఇది శుద్ధ పొరపాటు. మొత్తం పెట్టుబడిదారీ విధానంలో లాగే అమెరికా పెట్టుబడిదారీ విధానంలోకూడా పరస్పర వైరుధ్యాలు తీవ్రతరమవుతున్నాయి.

అమెరికా కోటీశ్వరులకు చెందిన 'వెయ్యి కుటుంబాల' చేతుల్లోనే అమెరికా ప్రచార సాధనాలన్నీ వున్నా ప్రజాస్వామిక శక్తులంటేను, సోవియట్ యూనియన్ అంటేను అమెరికా ప్రజల్లో ఏమాత్రం తక్కువ అభిమానంలేదు. అమెరికాలో కొత్తగా ఏర్పడిన ప్రోగ్రెసివ్ పార్టీయే ఇందుకు నిదర్శనం. ఈ ప్రోగ్రెసివ్ పార్టీ సోవియట్ యూనియన్‌తో స్నేహసంబంధాలుండాలని వాంఛిస్తోంది. స్వదేశంలోని గుత్తవ్యాపారస్థులకు వ్యతిరేకంగా కృషిచేయడం తన ఆశయంగా పెట్టుకుంది.

బూర్జువా పత్రికలు అమెరికాను గురించి ఎంతగా డబ్బాగొడుతూవున్నా అమెరికాలోని నేటి ఆంతరంగిక రాజకీయ పరిస్థితి ఆ పత్రికలు చిత్రించినట్లుగా ఏమాత్రం లేదు.

**అమెరికాలో కొత్తగా ఏర్పడుతూన్న ఆర్థిక సంక్షోభంతో అమెరికా పరిస్థితి మరింత అధ్వాన్నమవుతుంది.**

ఈవిధంగా రెండువిధానాలు—పెట్టుబడిదారీ, సోషలిస్టు విధానాలు – బలాబలాల్లో ఎంతో మార్పువచ్చింది. ఒకవైపు సోవియట్ యూనియన్, ప్రజాస్వామిక ప్రజాతంత్రదేశాలు, వలసదేశాలూ వున్నాయి. సోవియట్ యూనియన్‌యొక్క, ప్రజాస్వామిక ప్రజాతంత్రదేశాలయొక్క గౌరవప్రతిష్టలు రోజురోజుకూ ఇనుమడిస్తున్నాయి. వలసదేశాల్లో జాతీయ విముక్తి పోరాటాలు నానాటికీ బలపడుతున్నాయి. ఇక మరోవైపు నానాటికీ

క్రుంగిపోతూవున్న పెట్టుబడిదారీశక్తులు, పెట్టుబడిదారీదేశాల్లో అత్యధిక సంపన్నమైన అమెరికాలో రోజురోజుకూ తీవ్రతరమవుతూవున్న పరస్పర వైరుధ్యాలువున్నాయి.

* * *

ఇక పెట్టుబడిదారీవిధానంలోవున్న ఆర్థిక వైరుధ్యాలనుగురించి కొంచెంపరిశీలించుదాం.

వుత్పత్తిశక్తులన్నిటినీ పూర్తిగా వుపయోగించుకోలేకపోవడం, నిరుద్యోగ సమస్యకు అనేకమందిగురికావడం పెట్టుబడిదారీవిధానం యొక్క సర్వవ్యాప్త సంక్షోభంలో కనపడే ప్రధానలక్షణం.

ప్రస్తుతానికి అమెరికాలో వుత్పత్తిశక్తుల నుపయోగించుకోడానికి అమెరికా చేసే ఎగుమతులూ, సైనికవిధానాన్ని విపరీతంగా పెంచడం, యుద్ధోపయోగకరమైన సామగ్రిని తయారుచేసేందుకు ప్రభుత్వం ఇచ్చే ఆర్డర్లూ, అమెరికా భాగ్యవంతులకోసం తయారుచేసే ప్రత్యేకసామాన్లూ, కొంతవరకు తోడ్పడతాయి.

అయినప్పటికీ అమెరికా ప్రభుత్వ లెక్కల ప్రకారమే నేడు అనేక పరిశ్రమలు పూర్తిశక్తి నుపయోగించి పనిచేయడంలేదు. ఉదాహరణకు అమెరికా లోహపరిశ్రమనే తీసుకోండి. అది మొత్తం తనవుత్పత్తిశక్తిలో నూటికి 60-70 వంతులవరకే పనిచేస్తూవుంది. యుద్ధకాలంలో పూర్తిగా అభివృద్ధిచెందిన ఎలెక్ట్రిక్ ఫర్నేసెస్ నేడు నూటికి 40 నుంచి 50 వంతుల వరకే పనిచేస్తూవుంది. కృత్రిమంగా రబ్బరు తయారుచేసే పరిశ్రమల్లో నూటికి 30 వంతుల వుత్పత్తిశక్తిమాత్రమే వినియోగించబడుతూవుంది.

ఇక అమెరికాలోని ఆంతరంగికమార్కెట్టు యొక్క స్థితిగతు లెలావున్నాయో చూద్దాం.

1948 ఫిబ్రవరి, మార్చి మాసాల్లోనే ఆర్థిక సంక్షోభం యొక్క ప్రారంభ చిహ్నాలు కనిపించాయి. వసువులు నిలవ వుండిపోవడం, ఆర్డర్లు తగ్గిపోవడం, అందువల్ల అనేక పరిశ్రమలుపూర్తికాలంపనిచేయకుండా వారంలో కొన్నిరోజులు మాత్రమే పనిచేయవలసి రావడం, అనేకమంది కార్మికులను వుద్యోగాలనుంచి తొలగించడం, స్టాక్ ఎక్స్ఛేంజిలో నిలకడలేకపోవడం ఇవన్నీ అమెరికాలో రానున్న ఆర్థిక సంక్షోభాన్ని సూచిస్తున్నాయి. మార్చి 17వ తేదీన ట్రూమన్ యుద్ధోన్మాదాన్ని రెచ్చగొడుతూ వుపన్యాసంచేశాడు. అమెరికా గుత్తవ్యాపారస్థుల ప్రయోజనాలకోసం ఆదేశంలో యుద్ధావేశం పురికొల్పబడుతూవుంది. కోట్లకొలది రూపాయల విలువగల యుద్ధఆర్డర్లు పరిశ్రమలకు - ముఖ్యంగా భారీ పరిశ్రమలకు కొత్తగా ఇవ్వడం జరిగింది. యుద్ధ ఆర్డర్ల ఫలితంగా వుత్పత్తి పెంచడం, కొంతమంది కార్మికులకు పనిచూపించడం వగైరా జరిగింది. ఈవిధంగా అమెరికా ఆర్థికపరిస్థితికి యుద్ధోన్మాదం కొంతవరకు వుపయోగపడింది. కాని, ఇది అసలు సమస్యకు శాశ్వతపరిష్కారం కాదు- కాజాలదు. మూన్నాళ్ళ ముచ్చటమాత్రమే.

ఇదే సమయంలో ప్రపంచ మంతటా పూర్తిగా పెట్టుబడిదారీవిధానం దెబ్బతినడం, ముఖ్యంగా అమెరికా సామ్రాజ్యవాదవిధానం కూడా దెబ్బతినిపోతూ వుండడం మనకు స్పష్టంగా కనిపిస్తూనేవుంది. వుత్పత్తి పడిపోకుండా నిలబెట్టేందుకు పెట్టుబడిదారులు శాంతిసమయంలో యుద్ధకాల ఆర్థికవిధానాన్ని నిర్మిస్తూవున్నారు.

అమెరికాలో సైనికబలం ఎంతవిపరీతంగా పెంచబడుతూవుందో చూస్తే అసలు పెట్టుబడిదారీవిధానం ఎంత ప్రమాదపరిస్థితికి గురి అయిందో బోధపడుతుంది. ఆంతరంగికశక్తుల నభివృద్ధిజేసే అవకాశాన్ని కోల్పోయిన ఈ యుద్ధోన్మాదకశక్తులు కోట్లకొలది కార్మికులను సర్వనాశనం చేయడంద్వారానూ, కష్ట

తీవ్రమైన ప్రజాసామాన్యం తరతరాలనుంచీ చెమటోడ్చి సృష్టించిన సంపత్తిని విధ్వంసం చేయడంద్వారానూ తమ లాభాలు కాపాడుకోవాలని ఆశిస్తున్నాయి.

* * *

పెట్టుబడిదారీదేశాల్లో వర్గసంఘర్షణ తీవ్రతరమైనకొలదీ పెట్టుబడిదారీసంక్షోభంఇంకా అధ్వాన్నస్థితికి దిగజారుతుంది.

వర్గసంఘర్షణ ఇంకా తీవ్రతరమవుతుంది అనడానికి తగిన ఆర్థిక కారణాలేమిటి? రెండో ప్రపంచ యుద్ధకాలంలో బడాపెట్టుబడిదారీ వర్గం యుద్ధానికి పూర్వపురోజుల్లోకంటె మూడురెట్లు ఎక్కువ లాభాలు గడించింది. 1947లో అమెరికా పరిశ్రమలకు 1740కోట్ల డాలర్ల లాభం వచ్చింది. అంటే యుద్ధకాలంలో వచ్చిన లాభం కంటె కూడా 1947 లో వచ్చిన లాభం రెట్టింపుఅన్నమాట. యుద్ధకాలంలో సాలీనా వచ్చిన లాభం 980 కోట్ల డాలర్లు.

ఒక్క 1947 వ సంవత్సరంలోనే 962 అమెరికా పరిశ్రమలు నూటికి 50 వంతుల లాభాన్ని గడించాయి. అప్పుడు వాటిలాభాల ప్రమాణం 1½ రెట్లు వుండేది. 1946 పెట్టుబడియొక్క నిష్పత్తిని పట్టిచూస్తే నూటికి 13½ నుంచి 1947 లో నూటికి 17.1 వరకు పెరిగింది.

ఈ పైనుదహరించిన లెక్కలు చాలా ముఖ్యమైనవి. ఎందుకంటే, పెట్టుబడిదారీ విధానంలో సామాన్యంగా ఎక్కువలాభాలు యుద్ధకాలంలోనే వస్తాయి. మొదటి ప్రపంచ యుద్ధానంతరం వచ్చిన అనుభవం కూడా దీన్నే ధృవపరిచింది. యుద్ధకాలంలోవచ్చినట్లుగా లాభాలు యుద్ధానంతర కాలంలో రావు. రెండు ప్రపంచ యుద్ధాలమధ్య వెలువడిన సాహిత్యంలోకూడా యుద్ధకాలంలోనే లాభాలు జాస్తిగా వస్తాయి అని సర్వసామాన్యంగా పేర్కొంటూ వుండేవారు.

కాని ఇప్పటి పరిస్థితి మారిపోయింది. అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సుదేశాల్లో ప్రభుత్వసహాయంతో గుత్తవ్యాపారస్థులు యుద్ధకాలంలోలాగే యుద్ధానంతరకాలంలో కూడా తమ లాభాలు రాబట్టుకోగలిగారు. గుత్తపెట్టుబడి ప్రభుత్వ గుత్తపెట్టుబడిగా మారడాన్ని ఈవిషయం సుస్పష్టంచేస్తుంది. అందువల్ల కూలీరేటు, ధరలు, లాభాలు, పన్నులు నేడు ప్రధాన సమస్యలుగా ఎదుర్కొంటున్నాయి. యుద్ధకాలంలోలాగే నేడుకూడా-యుద్ధానంతర కాలంలోకూడా - శాంతిసమయంలో కూడా - తమ దోపిడిని, అదేవిధంగా శాశ్వతంగా సురక్షితంగా కొనసాగించాలని గుత్తవ్యాపారస్థులు తీవ్రంగా ప్రయత్నిస్తున్నారని ఇందువల్ల స్పష్టమవుతోంది.

గుత్తవ్యాపారస్థులు సాగించే ఈ దోపిడిఫలితంగా కార్మిక ప్రతిఘటన, వర్గవైరుధ్యం, వర్గసంఘర్షణ రోజురోజుకూ తీవ్రతరమవుతుంది.

రెండో ప్రపంచ యుద్ధసమయంలో ప్రధాన పెట్టుబడిదారీ దేశాల్లోని గుత్తవ్యాపారస్థులంతా దేశద్రోహులుగాతయారయ్యారు. హిట్లరు ఆక్రమించుకున్న యూరప్ దేశాల్లోని గుత్తవ్యాపారస్థులు నాజీలతో చేతులు కలిపారు. అదేవిధంగా ఆసియాలోని గుత్తవ్యాపారస్థులు జపాన్ దురాక్రమణదారులతో పొత్తుకలిపారు. ఇక బ్రిటన్ అమెరికా దేశాల్లోని గుత్తవ్యాపారస్థులు రెండోరంగాన్ని చివరదాకా వాయిదా వేయడంలాంటి చేతలతో జర్మనీ దురాక్రమణదారులకు తోడ్పడ్డారు. ఇక నేటి పరిస్థితి ఏమిటంటే అనేక పెట్టుబడిదారీ ప్రభుత్వాలు అమెరికా సహాయంతో తమ పెట్టుబడిదారీవర్గ ప్రయోజనాలను కాపాడుకోడంకోసం తమ మాతృభూములను టోకుగానో, లేక చిల్లరగానో అమెరికా సామ్రాజ్యవాదులకు అమ్మివేస్తున్నాయి. ఈవిధంగా గుత్తవ్యాపారస్థులు దేశద్రోహానికి

పాల్పడితే ఆనాడు ఫాసిజాన్ని వ్యతిరేకించి పోరాడిన కార్మికవర్గమే నేడు దేశ స్వాతంత్ర్యంకోసం అగ్రశ్రేణిలోవుండి పోరాడుతూ తన దేశభక్తిని రుజువుచేసుకుంది. 'గుత్తవ్యాపారానికీ, విదేశీ సామ్రాజ్యవాదానికీ, వ్యతిరేకంగా– ఆనాడు జర్మనీకీ, నేడు అమెరికా సామ్రాజ్యవాదానికీ వ్యతిరేకంగా– పోరాటం సాగించేందుకు అసంఖ్యాక ప్రజానీకాన్ని సమీకరిస్తూవుంది.

జాతికీ, వర్గానికీ సంబంధించిన నినాదాల రెంటినీ మేళవింపజేస్తూ– సోవియట్ యూనియన్ అధ్వర్యాన కార్మికులయొక్క, తదితర కష్టజీవులైన ప్రజాసామాన్యంయొక్క– అంతర్జాతీయైక్యతా నినాదాలతో అమెరికా సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా నిజమైన జాతీయ స్వాతంత్ర్య పోరాట నినాదాలను మేళవింపజేస్తూ – ఆ ప్రాతిపదికపై కార్మికవర్గంచుట్టూ కమ్యూనిస్టుపార్టీ చుట్టూ అసంఖ్యాక ప్రజానీకాన్ని సమీకరించడానికి అనుకూలమైన నూతన పరిస్థితులేర్పడడం నేడు మనం కండ్లారాచూస్తున్నాం.

* * *

సామ్రాజ్యవాద శిబిరంలో పోరాటాలు తీవ్రతరమైనకొలదీ పెట్టుబడిదారీ సంక్షోభం ఇంకా విషమిస్తుంది.

ప్రపంచాన్ని తిరిగి పంచుకోడంకోసం అమెరికా పోరాడుతూవుంది. అయితే సామ్రాజ్యవాదంయొక్క ప్రారంభదినాల్లోని పోరాటపద్ధతికీ, ఇప్పుడు అమెరికా సాగించే పోరాటపద్ధతికీ తేడావుంది. మొదటి ప్రపంచ యుద్ధసమయంలో వలసదేశాలను పంచుకోడం, ఇరుగుపొరుగు దేశాల్లోని కొంత ప్రదేశాన్ని ఆక్రమించుకోనడం – ఇదే జర్మనీ అనుసరించిన పంథా. యూరోపుఖండంలోని 'నాగరిక' దేశాలను వలసదేశాలుగా మార్చి వాటికి స్వాతంత్ర్యంలేకుండా చేయడమనే దృష్టి ఆనాటి జర్మనీకి లేదు. కాని రెండో ప్రపంచయుద్ధసమయంలో వలసదేశాలను తిరిగి పంచుకోడమే జర్మనీయొక్క ప్రధానలక్ష్యం కాదు. తనకు పోటీగావున్న దేశాలను దెబ్బగొట్టి, వాటికి స్వతంత్రహోదా లేకుండాచేసి, యూరోపులోని (ఫ్రాన్సు, జెకోస్లోవేకియా, సోవియట్ యూనియన్ లాంటి పారిశ్రామికదేశాలను తనమీద ఆధారపడే వ్యావసాయిక దేశాలుగా మార్చడమే జర్మనీయొక్క ప్రధానాశయం.

జర్మనీ అడుగుజాడలనే అనుసరిస్తోన్న అమెరికా కూడా నేడు ప్రపంచాధిపత్యం కోసం పోరాడుతూవుంది. సైనిక బలప్రయోగంద్వారానూ, డబ్బుసంచుల సహాయంతోనూ పారిశ్రామికంగా అభివృద్ధిచెందిన దేశాలతోసహా మొత్తం దేశాలన్నిటినీ తన వలస, అర్ధవలసదేశాలుగా మార్చుకోవాలని అమెరికా ప్రయత్నిస్తూవుంది. ప్రపంచ పునర్విభజనకోసం జరిగే పోరాటంలో ఇది ఒక నూతనదశ.

కాని అమెరికా తలపెట్టే ఈ గొంతెమ్మ కోర్కెలు ఎప్పటికీ నెరవేరేవి కావనివేరేచెప్ప నవసరంలేదు. జర్మనీకి పట్టినగతే అమెరికాకు కూడా పడుతుంది. ఇలాంటి గొంతెమ్మ కోర్కెలు ప్రపంచ ప్రజల్లో ద్వేషాన్ని రగుల్కొల్పుతాయి. అమెరికా అవలంబించే ట్రూమన్ సిద్ధాంతవిధానమూ, మార్షల్ ప్రణాళిక విధానమూ, ప్రపంచాధిపత్యం కోసం సాగించే పోరాటం – ఇవన్నీ సామ్రాజ్యవాద శిబిరంలోనే పరస్పర వైరుధ్యాలకు దారితీస్తాయి. ప్రపంచాధిపత్యం అనే అందనిమ్రానిపండుకు అర్రుజాచే అమెరికావిధానం ఫలితంగా సామ్రాజ్యవాదశిబిరంలో పరస్పర వైరుధ్యాలు బయలుదేరక తప్పదు.

1945 చివర, 1946 ప్రారంభంలో– అమెరికా ఇతరదేశాలతో సంబంధాలు కలుపుకో

డానికి అతి తీవ్రంగా ప్రయత్నిస్తూన్న సందర్భంలో - ల్యాటిన్ అమెరికా దేశాల మార్కెట్టునుంచి బ్రిటన్ అమెరికాను త్రోసివేయగలిగింది. ఎంతో కాలంనుంచి ఆదేశాలకు అమెరికా దిగుమతిచేస్తూన్న మోటార్లు, రసాయన వస్తువులూ, విద్యుత్ పరికరాలకు కూడా అక్కడ స్థానం లేకుండా చేసింది. నేడు మళ్ళీ అమెరికా ఇందుకు బదులుతీర్చుకుంటూవుంది. దక్షిణ అమెరికాకు చెందిన అనేక దేశాల్లో అమెరికా ప్రోత్సాహంతో "అమెరికాఖండంనుంచి బ్రిటిష్ వాళ్ళను దూరం చేయాలి." అనే నినాదంతో ప్రచారం జరుగుతూవుంది. దూరప్రాచ్య దేశాల్లో, సమీపప్రాచ్యదేశాల్లోకూడా బ్రిటన్ అమెరికాల మధ్య తీవ్రసంఘర్షణ జరుగుతూవుంది.

పెట్టుబడారీ విధానంలో సంక్షోభం తీవ్రతరం అవుతుందంటే దానంతటదే నశించిపోతుంది అనుకోడం పొరపాటు. ఏదేశంలోనూ, ఏసమయంలోనూ పెట్టుబడిదారీ విధానం దానంతటదే నశించిపోవడం జరగదు. పెట్టుబడిదారీ విధానం నశించి పోవాలంటే పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా సోషలిజంకోసం సాగించే పోరాటంలో నిజమైన ప్రజాస్వామికశక్తులన్నీ సంఘటితం కావలసివుంటుంది. ఐక్యంగా పోరాడవలసివుంటుంది.

ఈ ప్రజాస్వామికశక్తుల బలాబలాల్లో పెట్టుబడిదారీ సంక్షోభంయొక్క మొదటి రోజులకూ, నేటికీ చాలా మార్పువచ్చింది. అనేక పెట్టుబడిదారీ దేశాల్లో కమ్యూనిస్టు పార్టీయే అన్నిటికంటె బలవత్తరమైన రాజకీయపార్టీగా వుంది. ఇంకా అనేకదేశాల్లో కార్మికవర్గం నుంచి అధిక సంఖ్యాకులనూ, రైతాంగంనుంచి, చేతిపనివారినుంచి, మేధావి వర్గంనుంచికూడా తగినంతమందినీ కమ్యూనిస్టు పార్టీలు తమవైపు రాబట్టుకో గలిగాయి. అంతేకాకుండా సిద్ధాంతరీత్యా, నిర్మాణరీత్యా కూడా కమ్యూనిస్టుపార్టీలు నేడు ఎక్కువగా బలపడ్డాయి.

మొదటి ప్రపంచయుద్ధానంతరం సోషల్ డిమోక్రటిక్ సంస్కరణవాదులపై సామ్రాజ్యవాదానికి సాంఘికంగా తగినంత పలుకుబడి వుండేది. కాని నేడు సామ్రాజ్యవాదంయొక్క సాంఘిక పునాది బలహీనపడిపోయింది. దాని వెనకవున్నశక్తుల్లోనే చీలికలు బయలుదేరుతున్నాయి.

సోవియట్ యూనియన్ ఏర్పడడమే - దానియొక్క అస్తిత్వమే - పెట్టుబడిదారీ పునాదులను ఊపివేస్తుంది. మొదటి ప్రపంచయుద్ధంలో వుద్భవించిన సోవియట్ యూనియన్ ఇంకా బలహీనంగావున్న- శైశవావస్థలోవున్న - అరోజుల్లో సోషలిజంవైపు పురోగమించడానికి ఆదేశం అనేక కష్టాలను ఎదుర్కోవలసివచ్చింది. ఆర్థిక విధానాన్ని పునర్నిర్మించుకోవలసివచ్చింది. దేశాన్ని పారిశ్రామికంగా అభివృద్ధిచేయడం, కోట్లకొలది రైతుల్ని సోషలిస్టు వ్యవసాయంలోకి మార్చడం, తర్వాత హిట్లరు జర్మనీలాంటి ప్రబలశత్రువును ఏకాకిగా ఎదిరించి ఆత్మరక్షణ చేసుకోడం లాంటి అనేక కష్టాలు ఎదుర్కొన్నాయి. ఆకష్టాలన్నిటినుంచి సోవియట్ యూనియన్ దిగ్విజయంగా బైటబడగలిగింది. ఇక నేడో సోవియట్ యూనియన్ అత్యంత బలీయమైన పారిశ్రామిక దేశంగా అభివృద్ధిచెందింది. సోషలిజంనుంచి కమ్యూనిజానికి నిరాఘాటంగా పురోగమిస్తూవుంది.

ఈవిషయాలన్నీ పెట్టుబడిదారీ విధానం పతనంచెందక తప్పదని చాటిచెప్తున్నాయి. మనకాలంలో "అన్నిరాష్ట్రాలూ కమ్యూనిజానికే చేరుకుంటున్నాయి."

("న్యూస్ అండ్ వ్యూస్ ఫ్రం ది సోవియట్ యూనియన్" నుండి 5-1-1949)

# తెలంగాణా విప్లవం

## : భారతప్రజల కర్తవ్యం :

నైజాం నిరంకుశ పరిపాలనక్రింద, రజాకారు దుండగీండ్ర దురంతాల క్రింద చిరకాలంగా కుమిలిపోతూన్న సంస్థాన ప్రజలు నాలుగునెలలక్రితం భారతసైన్యాలు హైద్రాబాదులో ప్రవేశించినప్పుడు ఎంతో సంతోష పడ్డారు. భారత జాతీయనాయకులు, స్టేటు కాంగ్రెసునాయకులు స్వాతంత్ర్యంపేరిట చేసిన పెద్ద పెద్ద ప్రకటనలన్నీ నమ్మి, భారతసైన్యాలు జయించాక, ఆ అసహ్యమైన మధ్యయుగపు విధానం పోతుందనీ, నైజామూ, అతని జాగీర్దార్లూ చేస్తున్న దౌర్జన్యాలు అంతరిస్తాయనీ, ఆర్థిక సమస్యలు పరిష్కరించబడి నిజమైన ప్రజాస్వామికం నెలకొల్పబడుతుందనీ, నిజాం ప్రజలు ఆశించారు.

కాని, యీ నాలుగు నెలల్లో వారికి కన పడుతున్న దృశ్యం వేరు. ఈదృశ్యం కాంగ్రెసు భక్తులకుసైతం దిగ్భ్రమ గొలుపుతున్నది. ప్రజా స్వామిక పరిపాలనను గురించి చర్చలు జరుగు తూనే వున్నవి. రాజ్యాంగ నిర్మాణసభ ఎన్ని కలకోసమని ఓటర్ల లిస్టులు తయారు జేయ టానికి ప్రయత్నాలు జరుగుతున్నవి. జమీం దారీ విధానాన్ని రద్దుజేయటాన్ని గురించి, వ్యావసాయిక సంస్కరణలు ప్రవేశపెట్ట డాన్నిగూర్చి నెహ్రూపండితుడు ఉద్ఘా టిస్తూనే వున్నాడు.

ఇంతచేసినా ప్రజాస్వామికం పేరిట యీ ముసుగు ప్రజల కళ్ళు కప్పలేకపోతూ వున్నది. యీ వాగ్దానాల వెనుక జరుగుతున్న కఠోరసత్యాలు వాళ్ళ కండ్ల ముందు తెరదీసినట్లు మరీ స్పష్ట ముగా కనిపిస్తూ వున్నాయి.

ప్రజాపోరాటంవల్ల పూర్తిగా చెల్లాచెద రైన నిజాం ప్రభుత్వ నిరంకుశ యంత్రాన్ని, పటేలు నెహ్రూ ప్రభుత్వపుటాజ్ఞల ప్రకారం మిలిటరీ గవర్నరు పునర్నిర్మిస్తున్నాడు. బొంబాయి, ఢిల్లీలనుంచి పంపబడిన సమర్థులైన అధికారుల పరిశీలనక్రింద నిజాం సివిల్ పోలీస్ పరిపాలనా యంత్రం పునరుద్ధరించ బడి, అదనపుబలం సంపాదించుకొంటున్నది.

ఈ పరిపాలనా యంత్రం ఇప్పుడు విజృంభిస్తున్న ప్రజోద్యమాన్ని అరికట్టటానికి పూర్వం కంటె ఒక ప్లాను ప్రకారం మరింత క్రూరంగా తయారవుతున్నది. కష్టజీవులకు ఏమాత్రం రక్షణ కల్పించకపోగా, జమీందార్లూ, దేశముఖులూ, వాళ్ళ వాళ్ళ గూండాలూ పూర్వములాగే మళ్ళీ ప్రజల్ని దోచుకోటానికి ఈ యంత్రం రక్షణ ఇస్తున్నది.

## పురాతన నిరంకుశత్వానికి పునః ప్రతిష్ఠ

ఆ పాత నిరంకుశాధికారులే మళ్ళీ తమ పూర్వపదవుల్ని అలంకరించారు. ఆ పోలీసులే ఆ మాజిస్ట్రేట్ లే భారతసైన్యాన్ని అండ జేసుకుని మళ్ళీ పైకివచ్చారు. రజాకార్ల స్థానంలో ఖద్దరుటోపీలు పెట్టుకొని కొత్తవాళ్లు ప్రత్యక్షమైనారు. జాగీర్దార్లూ, దేశముఖులూ, పోషిస్తున్న దోపిడిగాళ్ళు, గూండాలూ హఠాత్తుగా కాంగ్రెసు మతం పుచ్చుకొని, కమ్యూనిస్టులపై పోరాటం పేరిట, ప్రజల మీద రజాకార్లు చేసిన దురంతాలే చేస్తున్నారు.

సంస్థానప్రజల విప్లవ పోరాటాలను విధ్వంసం చెయ్యటంలో భారత జాతీయనాయకులకు బంటుగా విశ్వాసపాత్రంగా పనిచేసిన రామానందతీర్థ నాయకత్వంలోని స్టేటుకాంగ్రెసుకు ఇంకా సంస్థానంలోని కొన్ని ప్రాంతాల్లో కొంత పలుకుబడి వున్నప్పటికీ తాత్కాలిక మంత్రివర్గం నిర్మించటానికి అనుమతి లేదు.

పోటీ ఆంధ్రమహాసభకు చెందిన అభివృద్ధి నిరోధకుల కూటం ఒకటి ఇప్పుడు పోటీ కాంగ్రెసుగా వ్యవహరిస్తున్నది. ఈముఠాకు జాగీర్దార్లతోనూ, దేశముఖులతోనూ, పెట్టుబడిదార్లతోనూ సన్నిహిత సంబంధం వుంది. నిజాం ప్రజాపోరాటం జరుగుతున్న రోజుల్లో నవాబుతో గూడుపుఠాణీచేసిన ముఠా ఇది.

ఈ ముఠా ఇప్పుడు తమకు సర్దార్ పటేల్ అండ వున్నదని బాహాటంగా చెప్పుకుంటూ, స్టేట్ కాంగ్రెస్ తమ షరతులకు లొంగిపోవాలని పట్టుపడుతున్నది. వీళ్ళ షరతు లేమంటే- స్టేట్ కాంగ్రెస్ లోని చైతన్యవంతులైన వారినీ, మార్క్సిస్టుభావాలు కలవారినీ బయటకు నెట్టివేయడం, కార్యవర్గాన్ని అభివృద్ధి నిరోధకులు చెప్పుచేతల్లో ఉండేటట్లు చెయ్యటం.

ఈ ముఠాకూ, స్టేట్ కాంగ్రెస్ కూ భారత జాతీయ నాయకులు మధ్యవర్తిత్వం నెరపటం చూస్తే ఒక విషయం తేటతెల్లమవుతుంది. స్టేట్ కాంగ్రెసులోని అభ్యుదయశక్తు లన్నిటిని గెంటివేసి లోగడ నవాబుసేవలోనూ, పురాతన నిరంకుశత్వాన్ని నిలబెట్టడంలోనూ బాగా విశ్వాసపాత్రులైన పోటీ కాంగ్రెసు అభివృద్ధి నిరోధక కూటానికి స్టేట్ కాంగ్రెస్ ను హస్తగతం చేస్తేనేగాని, పటేల్, నెహ్రూలు రామానందతీర్థ ముఠానుసైతం తాత్కాలిక మంత్రివర్గం నెలకొల్పనివ్వ రన్నమాట.

ఈ అభివృద్ధి నిరోధకకూటం వల్ల కృత్రిమంగా కల్పించబడిన ప్రతిష్టంభనను అవకాశం చేసుకొని పటేల్ ప్రభుత్వం తాత్కాలిక స్టేట్ కాంగ్రెసు ప్రభుత్వ నిర్మాణవాంఛను త్రోసిపుచ్చింది. ఎస్. వి. రామమూర్తిలాంటి నిరంకుశాధికారి అధ్వర్యాన

'తాత్కాలిక' మంత్రివర్గ నిర్మాణానికి పూనుకున్నది.

ఇది ఇలావుండగా, అటు మిలిటరీ ప్రభుత్వం పాత పరిపాలకులకు అధికారం కట్టబెడుతూ, జాగీర్దార్లకూ, భూస్వాములకూ పూర్వపు దోపిడికి అవకాశాలు కల్పిస్తూవుంది. జమీందారీ విధానం పోవాలని ప్రధాని నెహ్రూ ఉద్ఘాటించగానే, వ్యావసాయిక సంస్కరణలనుగూర్చి నివేదిక తయారుచెయ్యటానికి మిలిటరీ గవర్నరు ఒక కమిటీని నియమించాడు. ఇది ఆశతో ఎదురుచూస్తున్న రైతాంగం కళ్ళల్లో దుమ్ముకొట్టటం తప్పితే, మరేమీ కాదు.

పోరాటం రోజుల్లో ఛిన్నాభిన్నమైపోయిన నిజాం ప్రభుత్వపు పన్నులూ, కవుల్యా వసూలు చేసే దమనవిధానాన్ని మళ్ళీ ఈ మిలిటరీ ప్రభుత్వం పునర్నిర్మిస్తున్నది. పురాతన జమీందారీ విధానాన్ని అంతరింపజేసి, భూమిని రైతాంగం స్వాధీనము చేసుకున్న విప్లవ తెలంగాణా జిల్లాలమీదికి నిరంతరం పోలీసు దాడులు నడుపుతున్నది.

మాటల్లోనయితే–జమీందారీ విధానంరద్దుకు విచారణకమిటీలు. చేతల్లోనో – జమీందారీ విధానాన్ని అంతరింపజేసిన రైతాంగముమీద దాడులు. ఇక్కడే నిజం తేలుతుంది.

## రైతుల్ని దోచుకోవటం

రెండేళ్ళక్రితం సంస్థానంలో రైతాంగం తిరుగుబాటుకు కారణమైన పట్టపగటి దోపిడీ లాంటి అమానుషమైన ధాన్యసేకరణ విధానాన్ని సవరిస్తామని మిలిటరీ గవర్నరు ప్రకటించాడు. కాని, సవరణ నామమాత్రమైనది. అందులోని ప్రధానాంశాలు: నిర్బంధ ధాన్య సేకరణ, లెవీ మాత్రం అలాగే వున్నాయి. అంటే ఈ పరిపాలనక్రింద రైతాంగం వెనకటిలాగే నిలువుదోపిడీ చెయ్యబడతారన్న మాట.

ఆహారధాన్యాలయొక్క ఇతర అవసర వస్తువులయొక్క ధరలు పెరిగిపోతున్నాయి. హైదరాబాద్‌లోని కార్మికుల, కష్టజీవుల జీవిత పరిస్థితుల్ని ఈ ధరల పెరుగుదల తారుమారు చేస్తుంది. తక్కిన భారతదేశంలోకంటె కూడా ఇక్కడ దుర్భర పరిస్థితులేర్పడతాయి. ఈ పరిస్థితుల్ని ప్రతిఘటించటానికై కార్మికులు సమ్మెపోరాటాలు ప్రారంభిస్తున్నారు. సమ్మెలను అణచటంతోనూ, నాయకుల్ని నిర్బంధించటంతోనూ మిలిటరీప్రభుత్వందీనికి జవాబు చెబుతున్నది. తక్కిన సంస్థానాల్లో భారత ప్రభుత్వం ఏ లక్ష్యంతో పనిచేస్తున్నదో, ఇక్కడకూడా అదే లక్ష్యసాధనకు మిలిటరీ పరిపాలనద్వారా దారిచేసుకుంటున్నది.

ఆలక్ష్యం ఏమిటంటే–కేంద్రంలోని ఇండియన్ బూర్జువా ప్రభుత్వముయొక్క ఆర్థిక రాజకీయ పరిపాలనక్రిందకు సంస్థానాలనుతీసుకు రావటం; సంస్థానాలను భారతదేశంలోని పెద్ద పెట్టుబడిదారుల దోపిడీకి అనువుగా చేయుటం; అందుకుగాను జమీందారీ విధానాన్ని కొంత మార్పుచేసి సంస్థా

నాధిపతులతోనూ జమీందార్లతోనూ రాజీపడి పెద్దరాబందుల వెంట పిల్లరాబందులుగా వాళ్ళను చేరదీయటం; విజృంభిస్తున్న ప్రజాస్వామిక విప్లవాన్ని అణచివెయ్యటానికి వాళ్ళతో కలిసి సమిష్టిగా కృషి చెయ్యటం – ఇదీ భారతప్రభుత్వ లక్ష్యం.

కాని, భారతసైన్యాలు అడుగుపెట్టిన నాలుగునెలల తర్వాత, ఈనాడు హైదరాబాద్‌లోని వాస్తవ పరిస్థితి, నానాటికీ దుర్భరమవుతున్న రాజకీయార్థిక దుస్థితి, కష్టజీవుల్లో పెరిగిపోతున్న అసంతృప్తి, ప్రజలు దేనికోసం పోరాడారో ఆ ప్రతి ప్రజాస్వామి కాశయానికి వ్యతిరేకంగా శిథిలమైన పురాతన నిరంకుశ వ్యవస్థను నిర్మించటానికి తహతహపడుతున్న భారతప్రభుత్వం మీదా, స్టేట్ కాంగ్రెస్ మీదా లోగడ ప్రజలు పెట్టుకున్న భ్రమలు మటుమాయం కావటం, కష్టజీవుల పోరాటశక్తులమీద ప్రత్యేకించి తెలంగాణా విప్లవ రైతాంగం మీద ప్రభుత్వం నడుపుతున్న భయంకరమైన దాడులూ, దమనవిధానమూ – ఇదంతా, తెలంగాణా విప్లవోద్యమం యొక్క సాంఘిక రాజకీయ ప్రాముఖ్యం అర్థం చేసుకుంటేనే గాని, అర్థం కాదు. తక్కిన సంస్థానాల్లోని పోరాటాలకంటే హైదరాబాద్ పోరాటానికి ఉన్న ప్రత్యేకతను ఇదే వ్యక్తపరుస్తుంది.



కార్మికవర్గం, కమ్యూనిస్టుపార్టీల నాయకత్వాన లక్షలాది తెలంగాణా రైతులు నిజాం నిరంకుశాధికారానికీ, అతని తొత్తులైన భూస్వాములకూ వ్యతిరేకంగా ప్రబలమైన ప్రతిఘటనోద్యమాన్ని నిర్మించటమే కాక, ఆ జాగీర్దార్ల దేశముఖుల భూముల్ని స్వాధీనం చేసుకొని పేదరైతులకూ వ్యవసాయకూలీలకూ పంచిపెట్టారు. ఇవాళ ఈ నూతన విప్లవ ప్రజాశక్తులను ఎదిరించి భారత ప్రభుత్వపు అభివృద్ధి నిరోధక నాయకులు ముఖాముఖి నిలబడ్డారు.

## పోరాటంలో కొత్తదశ

భారతసైన్యం హైద్రాబాదులో ప్రవేశించటానికి తొమ్మిదినెలల పూర్వమే 1946 లో దేశముఖుల క్రింది దుర్భరమైన జమీందారీ నిరంకుశత్వం మీది తిరుగుబాటుగా బయలుదేరిన రైతుఉద్యమం కొత్తదశలో ప్రవేశించింది. ఆ దశ నిజాంసైన్యాన్ని సాయుధులై ప్రతిఘటించటం.

ప్రజానీకం మీద నిజాం రజాకార్లు ఘోర దురంతాలు చేస్తున్నప్పుడు, భారత జాతీయ నాయకులు ఒకవైపున నిరంకుశత్వాన్ని ప్రతిఘటించే ప్రజాపోరాటాన్ని విచ్ఛిన్నం చేస్తూ రెండోవైపున నిజాంతో రాజీ బేరాలాడుతున్నప్పుడు తెలంగాణా వీర రైతాంగం తమ సంఘం యొక్క, కమ్యూనిస్టుపార్టీ యొక్క నాయకత్వాన, నిజాంసైన్యాలను ప్రతిఘటించి చావుదెబ్బ కొట్టింది.

నిజాం పరిపాలన రెండు వేల గ్రామాల్లో అంతరించిపోయింది. పంచాయితీల ద్వారా పేద రైతులకు, వ్యవసాయ కూలీలకూ భూమి పంపకం జరిగింది. ఈ గ్రామాల్లో గ్రామకమిటీల రూపములో కష్టజీవులైన రైతాంగం

అండతోటి దళాల రక్షణ క్రింద ఒక నూతన విప్లవాత్మకమైన పరిపాలనా విధానం తలెత్తింది.

ఇది ఒక సరికొత్త విధానం. భారతదేశంలోని కష్టజీవుల పోరాటము – కొద్ది ప్రాంతంలోనైనా – ఒక కొత్తరూపం తీసుకున్నది. హైద్రాబాదులో శిథిలమైన జమీందారీ విధానం ఎలాంటి తీవ్రమైన దుర్భర పరిస్థితుల్ని కల్పించిందో చెప్పడానికి ఇదొకటి చాలు. తెలంగాణాలోని విప్లవరైతాంగమూ, వ్యవసాయ కూలీలు నిజాం పరిపాలనాధికారానికీ, జమీందారీ విధానానికీ పునాదులు పెకల్చి పెద్దగండి కొట్టారు ఇది సామ్రాజ్యవాదులకు, నిజాంకూ, భూస్వామికశక్తులకూ, అందరికంటే విప్లవ నిరోధకులైన బూర్జువానాయకత్వానికి గంగవెర్రులెత్తించింది. సామ్రాజ్యవాదంతోను, సంస్థానాధిపతులతోనూ, భూస్వాములతోనూ రాజీపడి, గూడుపుఠాణీ చేసి, బూర్జువానాయకత్వం నిలబెట్టాలని చూస్తున్న శిథిలావస్థలోని వలసవిధానానికి ఇది ఒక చావుదెబ్బ.

ఈ అభివృద్ధి నిరోధక వర్గాలు తెలంగాణా ప్రాముఖ్యాన్ని అర్థం చేసుకున్నారు. వాళ్ళు ఒక పెద్ద ఉప్పెనను చూసినట్లు బెదిరిపోయే ప్రజాస్వామిక విప్లవోద్యమాన్ని పసికట్టారు.

హైద్రాబాదులో జమీందారీ విధానం అంత్యదశలో వుందనటానికి తెలంగాణ స్పష్టమైన నిదర్శనం. వేలకొలది విప్లవరైతాంగం కొట్టిన దెబ్బకు రెండుజిల్లాలలో జమీందారీ విధానం నశించిపోయింది. ఇదే విప్లవోద్యమం తక్కిన సంస్థానమంతటా లేకపోవటానికీ, ఒకే ఒక సంయుక్త విప్లవవెల్లువలో సంస్థానం మునిగిపోక పోవడానికి కారణం సమానమైన అభివృద్ధిలేకపోవడం. ఇదిప్రజానీకం వెనుకబడి వుండడంవల్లా ఇంకా బూర్జువా నాయకత్వం మీద కొంత భ్రమ పోకపోవడంవల్లా సంభవించింది.

అందువల్లనే, ఇటు రైతాంగం విప్లవపోరాటము జరుపుతున్న సమయంలో ఈ విప్లవోద్యమాన్నిగురించి భయభ్రాంతులైన నిజామూ, భారతప్రభుత్వం మధ్య జరిగిన రాజీరాయబారాలు ఈవిచిత్ర పరిణామానికొచ్చాయి. నైజామూ, భారతప్రభుత్వమూ రెండూకూడా తెలంగాణా రైతులమీద–కమ్యూనిస్టులమీద అతిక్రూరంగా దాడిచేస్తున్నప్పటికీ, కమ్యూనిస్టులు భారత ప్రభుత్వ ఏజంట్లని నిజామూ, నిజాం ప్రభుత్వ ఏజంట్లని భారత ప్రభుత్వమూ ఆరోపించాయి. కమ్యూనిస్టుల్ని రైతువిప్లవాన్ని చూపి ఒకరినొకరు బెదిరించి తగి

నంత బేరం చేయడానికి నిజాం, భారత ప్రభుత్వాలు ప్రయత్నించాయి. అందువల్లనే రజాకార్ దురంతాలను అరికట్టడం కోసం భారత ప్రభుత్వం సైనిక చర్య తీసుకున్నప్పుడు నిజామును గానీ, ఆ నిరంకుశ జమీందారీ విధానాన్నిగానీ రూపుమాపడంకాక, తెలంగాణా స్వరూపంలో కనిపిస్తున్న ప్రజాస్వామిక విప్లవ ప్రమాదంనుంచి ఆపురాతన నిరంకుశత్వాన్ని పునరుద్ధరించడమే — భారత ప్రభుత్వానికి ప్రధాన లక్ష్యమైంది.

కాంగ్రెసు నాయకులు లోగడ భారత దేశంలో చేరిన సంస్థానాధిపతులకంటె తనకు ఎక్కువ సౌకర్యాలు కల్పిస్తామన్నప్పటికీ ఇండియన్ యూనియన్‌లో చేరడానికి నిజాం నిరాకరించాడు.

## నైజాంకు సౌకర్యాలు

తమ రాజీప్రయోజనాలకోసం కాంగ్రెసు నాయకులు స్టేటుకాంగ్రెసు నడిపిన ప్రజా పోరాటాన్ని విచ్ఛిన్నంచేసి అణచిపారేశారు. తెలంగాణా వీరుల్ని అణిచేయటంలోనూ, అరెస్టు చేయడంలోనూ, సిగ్గులేకుండా నైజాంతో సహకరించారు.

నైజాం ప్రజానీకానికి ప్రజాస్వామిక పరిపాలనను గ్యారంటీ చేస్తూ ప్రజలకే సర్వాధికారం గల రాజ్యాంగ నిర్మాణ సభను ఏర్పరచాలనే ప్రజాస్వామిక వాంఛకు ద్రోహం చేయడానికి కాంగ్రెసునాయకులు తలపడ్డారు. స్టేటు కాంగ్రెసుకు ఏదో రకం అధికారం ఇచ్చి, నామమాత్రంగా రాజ్యాంగ నిర్మాణ సభను ఏర్పాటు చేయడానికి ఒప్పుకుంటే, ఆ పాత నిరంకుశత్వాన్ని పూర్తిగా నిలబెట్టటానికికూడా అంగీకరించారు.

కాంగ్రెసునాయకులు ఇంతగా తగ్గి దగ్గరకు వచ్చినా మౌంటు బాటన్ సలహా ననుసరించి ఇండియన్ యూనియన్‌లో చేరడానికి నైజాం అంగీకరించలేదు. అతడు సామ్రాజ్యవాదులమీద, చర్చిలు మాంగ్టన్‌లమీద భారత దేశ హృదయంలో "స్వతంత్ర నిజాం డొమినియనును" బ్రిటిషు సైనిక కేంద్రంగా నిలబెట్టాలనే పాత సామ్రాజ్యవాద ప్లాను మీద ఆధారపడ్డాడు.

అందుకని తన దగ్గర కోటి రూపాయలు పుచ్చుకొని సర్. విలియం మాంగ్టన్ వాగ్దానం చేసిన సామ్రాజ్యవాదుల సహాయం తనపక్షం వస్తుందని బిర్ర బిగుసుకొని అట్లా ఎదురు చూస్తూ ఉండటానికే నిర్ణయించుకున్నాడు. అంతేగాక కాంగ్రెసు పక్షంనుంచి హైద్రాబాదులో ఏ మాత్రం పోరాటం వచ్చినా కాంగ్రెసు ఆ విషయాల్లో జోక్యం కలిగించుకున్నా దక్షిణ భారతం అంతటా మతకలహాలు వస్తాయని కాంగ్రెసు నాయకులను భయపెట్టడంకోసం రజాకార్లను రెచ్చగొట్టాడు. పతనావస్థలో వున్న ఒకవర్గంయొక్క ఈ ప్రతినిధి వేసిన అంచనాలన్నీ పూర్తిగా తలక్రిందులయినాయి.

(1) బ్రిటిషు సామ్రాజ్యవాదులు తమపాత ప్లానును ఎప్పుడో వదులుకున్నారు. భారత దేశంలో సామ్రాజ్యవాద ప్రయోజనాలను

కాపాడటానికీ, విప్లవ శక్తుల్ని అణిచి వేయడానికీ, అంతర్జాతీయంగా ఆంగ్లో అమెరికన్ కూటంలో చేరడానికీ సిద్ధమైన నెహ్రూ పటేల్ ప్రభుత్వంతో ఈ విషయంలో పేచీ పెట్టుకోవడం వాళ్ళ ఇష్టం లేదు.

(2) దక్షిణ భారతంలో మతకలహాలు వస్తాయని కాంగ్రెసు నాయకులు ఎంతమాత్రం భయపడటం లేదు. వాళ్లు భయపడుతున్న విషయం వేరు - హైద్రాబాదులోని పురాతన సాంఘిక వ్యవస్థ నిర్మూలమై పోవడం, నానాటికి పెరుగుతున్న ప్రజల అసంతృప్తి దానిఫలితంగా ఉద్భవించిన విప్లవ తెలంగాణా.

ఇండియన్ యూనియన్‌లో చేరడానికి నిరాకరించి హైద్రాబాదులో భారత పెట్టుబడిదార్లు రాజకీయ ఆర్థిక అధికారం చేపట్టకుండా అడ్డగించి, నిజాం ఆడుతున్న ప్రమాదకరమైన చదరంగాన్ని ఆపివేయక తప్పని పరిస్థితి ఏర్పడింది.

రజాకారు దురంతాలు కొనసాగించడానికి నిజాంకు అవకాశం ఇచ్చినకొలదీ, సాయుధులైన రజాకార్లను ప్రతిఘటించి, నిజాం అధికారాన్ని అంతం జేసి భూస్వాములను దేశముఖులను తరిమికొట్టి, దున్నేవానికే పొలం ఇచ్చిన తెలంగాణా రైతువీరుల్ని హైద్రాబాద్ ప్రజానీకం అంతా అనుసరించే ప్రమాదం అధికమౌతుంది గనక భారత ప్రభుత్వ జోక్యం తప్పనిసరి అయింది.

## పోలీసు చర్యలోని అంతరార్థం

రాజీబేరాలాడుతున్న ఈ పెట్టుబడిదార్లకు ప్రమాదకరమైన పరిణామాన్ని అరికట్టడం, నిజాంకు తెలివి కల్గించడం, రజాకార్లను తుడిచిపెట్టి ప్రజల్ని రెచ్చగొడుతున్న రజాకార్ల దురంతాలను అరికట్టడం, అన్నిటికంటె విప్లవ తెలంగాణా పల్లె ప్రాంతాలను ముట్టడించి రాజకీయంగానూ భౌతికంగానూ తక్కిన హైద్రాబాదునుంచి వాటిని వేరుచేసి నిర్మూలం చేయడమే భారత ప్రభుత్వం తీసికున్న సైనిక చర్యలోని అంతరార్థం. ఈ సైనిక చర్య ఏ విధంగా ఏర్పరచబడి అమలు పరచబడిందో దాని అనంతరం ఏయే విధానాలు ఏలా ఆచరణలో పెట్టబడ్డాయో చూస్తే ఈ సత్యం బయటపడుతుంది.

● నైజాం వ్యతిరేక పోరాటాన్ని స్టేట్ కాంగ్రెసులోని కొన్ని వర్గాలవారు అనుకున్నట్లు తీవ్రరూపాల్లో పెరగనివ్వకుండా నిరుత్సాహపరచి విచ్ఛిన్నం చేసినతర్వాతనే ఈ సైనిక జోక్యం ఏర్పాటు చేయబడింది. రజాకార్లను, నిజాం పోలీసును ప్రతిఘటించటానికి సంస్థానప్రజలు ఆయుధాలు కోరుతున్నప్పుడు వారికి ఆయుధాలు ఇవ్వక పోవటమే కాక, స్టేటుకాంగ్రెసులోని తీవ్రవాదులు ఇండియన్ యూనియనునుంచి ఆయుధాలు అందజేస్తారేమోనని సరిహద్దులనిండా పోలీసు మిలటరీ బలగాన్ని పెట్టి భారతప్రభుత్వం తెలంగాణా రైతుపోరాటాన్ని వెన్నుపోటు పొడిచింది.

● అప్పటికి రజాకార్లను నైజాం సైన్యాన్ని ఎదిరించి దెబ్బకుదెబ్బకొట్టి పోరాడుతున్న కమ్యూనిస్టులమీద నీచమైన నిందాప్రచారంతోపాటే ఈ సైనిక జోక్యం ప్రారంభమైంది. తెలంగాణ రైతుల వీరోచిత పోరాటాన్ని బూర్జువా పత్రికలు పూర్తిగా మరుగుపరిచి ఒక ప్రక్కన కమ్యూనిస్టులు రజాకార్లతో కలసి భారతప్రభుత్వానికి వ్యతి

రేకంగా పనిచేస్తున్నారని ప్రకటిస్తూ మరో ప్రక్కన రజాకార్ల దురంతాలను వర్ణిస్తూ వచ్చారు.

దీని ప్రయోజన మేమిటంటే నిజాం వ్యతిరేకపోరాటంలో ప్రజానీకం పాల్గొనకుండా చేయడం, అసంతృప్తితో వేగిపోతూ, నాయకత్వంకోసం ఎదురు చూస్తున్న తక్కిన హైద్రాబాదు ప్రజలకు, తెలంగాణ విప్లవరైతాంగానికీ మధ్య అగాధం కల్పించడం.

మొదట్లో హైద్రాబాదు ఇండియన్ యూనియన్‌లో చేరి, నిజాం సంస్థానంలోని జమీందారీ విధానం సైనికజోక్యం అవసరం లేకుండానే పెట్టుబడిదారీ రాజకీయార్థిక పరిపాలనక్రిందికి వచ్చేట్లు చూడాలని కాంగ్రెసు నాయకులు ప్రయత్నించారు.

సామ్రాజ్యవాదుల ప్రోద్బలంతో రజాకార్లను పెట్టుకొని ప్రమాదకరమైన జూదం ఆడుతున్న నిజాం మూర్ఖత్వంవల్ల ఇది సాధ్యపడలేదు. ఇందువల్ల తెలంగాణ రైతాంగం సాధించిన విజయాలుచూసి ఉత్తేజంపొంది హైద్రాబాదు అంతటా అలాంటి విప్లవాత్మకపరిణామం ఏర్పడే ప్రమాదం వచ్చింది. ఈ హైద్రాబాదు సమస్యకు తక్షణం ఏదో పరిష్కారం కావాలి. ఒక సైనికజోక్యం తప్పితే మరి గత్యంతరంలేదు.

నైజాం రాజీపడేటట్లు చేయడానికి బూర్జువా పెత్తనం క్రింద జమీందారీ విధానాన్ని పునర్నిర్మించడానికి ప్రజాస్వామిక విప్లవ శక్తులకు వ్యతిరేకంగా పెట్టుబడిదారీ జమీందారీ కూటమిని నిర్మించడానికి అనువైన విధంగానే ఈ సైనికచర్య ఏర్పాటు చేయబడింది.

## నైజాం కపటనాటకం

భారతసైన్యాలు హైద్రాబాదులో ప్రవేశించడంతో నైజాం నిజస్థితిని తెలుసుకున్నాడు. ఇక తన ఆటలు సాగవని అర్థం చేసుకున్నాడు. వెంటనే రజాకార్లను లాయకాలీ మంత్రివర్గాన్ని త్రోసిపుచ్చి ఇండియా సైన్యాలకు వ్యతిరేకంగా సంస్థాన సైన్యాల ప్రతిఘటనను ఆపుచేసి, ఈ దుష్టశక్తులకు బలైపోతున్న ఒక అమాయకుడిలాగానూ, ఖైదీలాగానూ నటించడానికి తయారైనాడు.

యుద్ధం ముగిసిన అయిదురోజులలోపుగా ప్రజలు విశ్వాసంతో ఇంకా విజయదినోత్సవం జరుపుతూ ఉండగానే — తెరవెనుక పెట్టుబడిదారీ నాయకత్వానికీ నైజాంతోనూ, అతని జమీందారీ తొత్తులతోనూ తమవర్గసమైక్యత జరిగిపోయింది.

కొద్దిమార్పులతో ఆపాత విధానాన్నే పునర్నిర్మించడమూ, తెలంగాణా రూపంలో కన్పించే విప్లవ శక్తుల్ని అణిచి వేయడం — ఇవే ఈ రాజీ రాయబారాల అంతర్యం.

## III

హైద్రాబాద్ మీద సైనికచర్య తీసుకోడంలోని ప్రధానోద్దేశ్యమేమిటో కాంగ్రెసు నాయకులు ఎప్పుడూ స్పష్టంగా చెప్పలేదు. మొదటినుంచీ దానికి 'పోలీసుచర్య' అని పేరు పెట్టి - రజాకార్లకు బుద్ధిచెప్పి, నిజాం ను వాళ్ళ సంకెళ్ళనుంచి తప్పించటానికన్నట్లు వ్యవహరిస్తూ వచ్చారు. భారతసైన్యం హైదరాబాద్‌లో ప్రవేశించిననాడే, మన గవర్నర్ జనరల్ రాజగోపాలాచారి నిజాంకు ఒక తంతి ఇస్తూ, అతని స్థానానికి ఏమీ భంగం వాటిల్లదని హామీ ఇచ్చాడు. నిజాం ప్రభుత్వం రజాకార్లనూ, కమ్యూనిస్టులనూ అణచలేక పోయింది కనకనే 'పోలీసుచర్య' తీసుకోవలసివచ్చిందని మరో తంతిలో తెలియజేశాడు.

సర్దార్ వల్లభాయ్ పటేలు, తన కలవాటైన స్పష్టమైన పరిభాషలో, అసలు కమ్యూనిస్టుల్ని అణచటంకోసమే ఈ చర్య తీసుకున్నామని ఒక ఉద్ఘాటన చేశాడు. అప్పటికే కమ్యూనిస్టులు హైదరాబాద్‌లో రెండు జిల్లాలు ఆక్రమించుకున్నారనీ, మరికొంతకాలం భారత సైన్యాలు ప్రవేశించకుండా వుండినట్లయితే, ఇంకా ఎక్కువ జిల్లాలమీద అధికారం సంపాదించేవారనీ పటేలు అన్నాడు.

నిజాంరక్షణకోసం పటేలు సైన్యాలు ప్రవేశించకపూర్వం, కమ్యూనిస్టుల అధీనంలోని రెండు జిల్లాల్లోను ఏం జరుగుతూ వుందో అందరికీ తెలుసు. ఆ ప్రాంతాల్లోని రైతాంగమూ, వ్యవసాయకూలీలూ కలసి అప్పుడే ఒక నూతన చరిత్ర నిర్మించారు. నిజాం నిరంకుశ పరిపాలనకు స్వస్తిచెప్పి, వ్యావసాయిక విప్లవాన్ని కొనసాగిస్తూ, ప్రజాపరిపాలన నెలకొల్పారు.

ఈ చారిత్రక పురోగమనాన్ని నిరోధించి, నిజాంనూ అతని నిరంకుశ పరిపాలననూ నిలబెట్టటానికీ, ఉవ్వెత్తుగా లేస్తున్న ప్రజాస్వామిక విప్లవోద్యమాల వెల్లువనుంచి జమీందారీ - పెట్టుబడిదారీ పరిపాలనా విధానాన్ని సంరక్షించడానికీ మాత్రమే పటేలు సైన్యం హైదరాబాద్‌లో ప్రవేశించింది.

భారతసైన్యాలు హైద్రాబాదులో ప్రవేశించడంలోని అంతరార్థాన్నే కాక, భారత ప్రభుత్వ యాజమాన్యాన మిలిటరీ ప్రభుత్వం హైద్రాబాదులో అనుసరించబోయే విధానాన్నికూడా పటేల్ ప్రకటన స్పష్టపరిచింది.

ప్రధాని నెహ్రూ గత మాసం హైదరాబాద్‌లో ఉపన్యసిస్తూ, ఇంకా సంస్థానంలో మిగిలివున్న జమీందారీ విధానాన్ని రద్దు చెయ్యాలనీ, "అలాంటి ప్రగతికి అనుగుణమైన వాతావరణం ప్రజలు కల్పించా"లనీ వాకొన్నాడు.

"సెర్ఫిఖాస్‌లూ, పైగాలూ, సంస్థానాలూ, జాగీర్లూ ఇంకా వున్నాయి. సాధ్యమైనంత త్వరలో వీటన్నిటినీ రద్దు చెయ్యాలి. వీటన్నిటి రద్దుకూ ఒక రాజ్యాంగ నిర్మాణసభ ఏర్పడడం ప్రాతిపదికగా వుంటుంది."

కాని, ఆచరణలో ఈ 'ప్రగతి' ఎలా సాధించబడుతున్నదో మనం కళ్ళారా చూస్తున్నాం.

● నవాబుకు అతని వెనకటి స్థానాన్ని ఇవ్వటమే కాక, వేలకొలది పాలేళ్ళ రైతుల రక్తంపిండి అతను పోగు

చేసుకొనే కోట్లకొలది సొంత ఆదాయం ఇంకా అలానే వుండనిచ్చారు. సెర్ఫ్‌ఖాస్ అనబడే అతని భూముల్లో పనిచేసే రైతుల నుంచి కవులురూపంలో అతనికి ప్రతిసంవత్సరం 2 కోట్ల 25 లక్షల రూపాయలు వస్తాయి. ఇదికాక సంస్థానపుబొక్కసం నుంచి ప్రీవీ - పర్సు క్రింద 50 లక్షల రూపాయలు వస్తాయి. ఇక నెహ్రూ ప్రభుత్వం తెచ్చే 'ప్రగతి' ఏమంటే - ఆ సెర్ఫ్‌ఖాస్‌ను సంస్థానపరంచేసి, నిజాము ప్రీవీ - పర్సుక్రిందనే కోటిరూపాయలు పుచ్చుకోవాలని.

● ఇక, సంస్థానాలనూ, జాగీర్లనూ రద్దుచెయ్యడమంటే - ఆ సంస్థానాధీశుల జాగీర్దార్ల పోలీసు అధికారాలు రద్దుచెయ్యటం మాత్రమే. నిజానికి వాళ్ళకంటె నిరంకుశంగానూ నిర్దాక్షిణ్యంగాను పన్నులు కవుళ్ళు వసూలుచేసే ప్రభుత్వ యంత్రాంగం వాళ్ళపని చేసిపెడుతుంది. కనుక వాళ్ళకు పోలీసు అధికారాలు పోయినా ఉన్నా ఒకటే. రజాకార్ల భయంవల్ల వెనక పోరాటకాలంలో పారిపోయిన రైతాంగానికి మిలిటరీ ప్రభుత్వం కొంత 'టెక్కావీ' పంచి పెడుతున్నది కూడా.

## మళ్ళీ దోపిడి దొంగలు

పోరాటకాలంలో గత సంవత్సరం రైతాంగం నిజాము కివ్వటానికి నిరాకరించిన పన్నులు, కౌళ్ళు యిప్పుడు మిలిటరీ ప్రభుత్వం నిజాముకు వసూలుచేసి పెడుతున్నది. పాత కస్టమునాకాలు మళ్ళీ పునరుద్ధరించ బడుతున్నాయి. పాత నిరంకుశాధికారులు మళ్ళీ అధికారంలోకి వచ్చారు. పోరాటపు రోజుల్లో తెలంగాణా బయటిప్రాంతాల్లోసైతం చెల్లాచెదరైన భూస్వాముల, వడ్డీవ్యాపారుల దోపిడీ నిధానాన్ని పునఃప్రతిష్ట జేయటానికి పూనుకొన్నారు.

● రెండేళ్ళక్రితం రైతుల తిరుగుబాటుకు ప్రత్యక్ష కారణాలైన ధాన్య సేకరణనూ, లెవీపద్ధతినీ కొంచెం సవరించి మళ్ళీ యిప్పుడు ప్రవేశపెడుతున్నారు. నిజాము లంచగొండి ప్రభుత్వయంత్రాంగం క్రింద ఇది (1) రైతాంగాన్ని నిలువు దోపిడీ చేయటానికీ, (2) భూస్వాములు, ధనికరైతులు ధాన్యందాచి, ధరలుపెంచి వ్యవసాయకూలీలకు, కార్మికులకు తిండి కరువూ, పస్తులూ తప్పని దుర్భరపరిస్థితులు కల్పించటానికీ - దారితీస్తుంది.

భారతసైన్యం ప్రవేశించిన తరువాత యీ నాలుగు నెలల్లోనే సంస్థానంలోని ఆహారపరిస్థితి మరింత విషమించింది. జాగీర్దార్లనూ, భూస్వాములనూ, వడ్డీ వ్యాపారస్తులనూ, కూడగట్టుకొని ఆ పాత లంచగొండి ప్రభుత్వయంత్రం ఆధారంగా మిలిటరీ ప్రభుత్వం ధాన్యసేకరణ ప్రారంభించింది.

దీని ఫలితంకూడా ఒక వంక దోపిడి దొంగలు ధాన్యాన్ని దాచి, బ్లాకు మార్కెట్ ద్వారా ప్రజలనుపస్తుపెడుతూ వుండగా, రెండోవంక పేద రైతాంగం నుంచి ధాన్యం లాక్కోటానికే తోడ్పడుతూవుంది.

● సంస్థానంలో ప్రజాస్వామికం నెలకొల్పే విషయంలో భారత ప్రభుత్వపు ఆలోచనా, ఆచరణా యిదివరకే స్పష్టపడ్డాయి. రామానందతీర్థ అధికారంలోని స్టేటు కాంగ్రెసుకు కూడా, కార్యవర్గంలో ఎక్కువ మందిని పోటీ కాంగ్రెసుకు చెందిన అభివృద్ధినిరోధకుల్ని చేర్చుకోక పోతే, తాత్కాలిక మంత్రివర్గం నిర్మించే

అవకాశంలేదు. పూర్వం స్టేటుకాంగ్రెసు ఒకరకం పోరాటం నడుపుతూవుండగానే నిజాంతో లాలూచీపడ్డ యీ అభివృద్ధి నిరోధకులే పురాతన నిరంకుశత్వానికి కావలికుక్కలుగా బాగా పనిచేస్తారని భారత ప్రభుత్వానికి నమ్మకం.

రాజ్యాంగనిర్మాణసభ ఎన్నికలకు ఏర్పాట్లుచేసి ఎన్నికలు జరుపవలసినకాలంలో, అంటే వచ్చే సంవత్సరంలో పూర్తిగా విశ్వసనీయమైన అభివృద్ధి నిరోధకమంత్రివర్గం అధికారంలో వుండటం భారతప్రభుత్వానికి ఇష్టం. అంటే వయోజన ఓటింగుమీద ఆధారపడ్డ రాజ్యాంగసభ ఎన్నికలు తమ గుప్పిటిలోవుండి, మళ్ళీ ఆ పురాతన జమీందారీ నిరంకుశత్వాన్ని పెట్టుబడిదారుల పెత్తనం క్రింద పునర్నిర్మించగల 'ప్రజా' మంత్రివర్గ నిర్మాణంలో పర్యవసించేట్టు చూడటమే భారతప్రభుత్వలక్ష్యం.

అందువల్లనే, తెలంగాణా విప్లవ రైతాంగంమీదా, వారికి నాయకత్వం వహిస్తున్న కమ్యూనిస్టులమీద క్రూర నిర్బంధ విధానం అమలు జరుపుతున్నారు. ఇదే వారి మొట్ట మొదటి ప్రప్రధానమైన కార్యక్రమం.

అందువల్లే స్టేటు కాంగ్రెసు లోపలా బయటాఉన్న చైతన్యవంతులందరినీ అణచటానికీ, కార్మికులలోనూ, రైతాంగంలోనూ, అణచబడిన మధ్యతరగతి వర్గాల్లోనూ సంస్థానమంతటా వున్న అశాంతినీ, పోరాట ఉధృతాన్నీ, అణచటానికీ ప్రయత్నిస్తున్నారు. నిజాం పాత ప్రభుత్వం పడిపోయి, భారతసైన్యాలు ప్రవేశించాకనే యీ ఉధృతం మరీ ఎక్కువైంది.

జమీందారీ విధానాన్ని రద్దుజేయటంలో భారత ప్రభుత్వ పురోగమనం ఇలా వుంది; ఈ పురోగమనానికి "అవసరమైన వాతావరణ" కల్పన యింత చక్కగా వున్నది. ప్రధాని నెహ్రూ హైదరాబాదు ఉపన్యాసంలోని ప్రధానాంశ మేమి టంటే తెలంగాణా విప్లవ రైతాంగంమీదా, కష్టజీవులమీదా, కమ్యూనిస్టులమీదా యుద్ధ ప్రకటన చేయటం.

"అలాంటి శక్తులను వాటి పూర్తిఅవకాశాలతోసహా, బలంతోసహా అంతరింపజేయటానికే భారత ప్రభుత్వం నిశ్చయించుకొన్నది. ఈ సమస్యకు హైద్రాబాదులోనూ, తతిమ్మా భారతదేశంలోనూ తన ప్రభుత్వం అత్యధిక ప్రాముఖ్యమిస్తుంది" అని నెహ్రూ అన్నాడు.

(హిందూ, డిసెం. 26, '48)

భారతసైన్యం ప్రవేశించిన తొలివారంలో కమ్యూనిస్టుపార్టీనీ, ఆంధ్ర మహాసభనూ, వాటి వాటిశాఖలనూ నిషేధించి తెలంగాణా గ్రామసీమల మీద తీవ్రమైన దాడులు ప్రారంభించి, కమ్యూనిస్టులమీద నిరంతర ప్రచారం మొదలుబెట్టినప్పుడే, తాము చెప్పేరకం 'పురోగమనానికి' 'అవసరమైన వాతావరణ కల్పన' చేయటానికీ, కాంగ్రెసునాయకులు పూనుకున్నారు.

మొదటినుంచీగూడా, వ్యావసాయిక విప్లవంకోసం, ప్రజాస్వామికంకోసం అగ్రశ్రేణిలో నిలబడి పోరాడుతూన్న తెలంగాణా రైతాంగాన్నీ, కష్టజీవులనూ, రూపుమాపటానికీ, వారికి నాయకత్వం వహించిన కమ్యూనిస్టులను బలిదీసుకోటానికీ కావలసిన మిలిటరీ పోలీసు చర్యలకే భారత ప్రభుత్వం, దాని నాయకులూ 'అత్యధిక ప్రాముఖ్యం' యిచ్చారు.

ఈ అగ్రశ్రేణిని విచ్ఛిన్నం చేయనిదే, తాము అభివృద్ధి నిరోధక జమీందారీవర్గాలతో చేసుకొన్న తప్పుడు రాజీలను నిలబెట్టుకోటం, ప్రజాశక్తులను అణచటం సాధ్యంకాదని కాంగ్రెసు నాయకులు తెలుసుకున్నారు.

# IV

ఈ నాలుగు నెలలబట్టి జరుగుతున్న చర్యలనుంచి వుట్టిపడేం దేమిటి? తెలంగాణా రైతాంగంమీదా, కార్మికులమీదా, కమ్యూనిస్టులమీదా ప్రచారం జేస్తున్న నిందలవెనక వున్న నిజం ఏమిటి?

భారతసైన్యం ప్రవేశించిన తొలివారాల్లో రజాకార్లు కమ్యూనిస్టులతో కలిసిపోయారనీ యీ రెండు శక్తులను సత్వరం తుడిచిపెడతామనీ అధికారవర్గాలు ప్రచారం జేశాయి. తరువాత మరో కొత్త కట్టుకథ: కమ్యూనిస్టులు కాంగ్రెసువాదులను చంపుతున్నారట! రైతులను భయపెడుతున్నారట!

నవంబరులో తెలంగాణాలో కొన్ని ప్రాంతాలలో పర్యటన జేసి రామానందతీర్థ చెప్పిన మాటలు చూడండి: కమ్యూనిస్టుల చేతుల్లో 500 గ్రామాలున్నాయి. కాని రైతాంగం వారి కెదురుతిరుగుతున్నది వారు ప్రవేశపెట్టిన వ్యావసాయిక సంస్కరణలు ఒక సూత్రంమీద ఆధారపడ్డవి కావు. కాంగ్రెసువాదులైనంత మాత్రాన వారు పేద రైతులైనాసరే, వారి భూములను లాక్కొంటున్నారు - ఇదీ రామానందతీర్థ తేల్చిన సారాంశం.

కాని తెలంగాణా సరిహద్దునవున్న మదరాసు రాష్ట్రంలోని ఆంధ్రగ్రామాలలో కమ్యూనిస్టుల పలుకుబడివ్యాపిస్తున్నట్టు డిసెంబరులోనే రిపోర్టులు వచ్చాయి. నల్లగొండ, వరంగల్ జిల్లాల రైతులమీద సమిష్టిచర్య జరపటంకోసం, మద్రాసు హైదరాబాదుల ప్రధాన పోలీసు అధికారులు ఖమ్మంమెట్టులో సమావేశమైనారు.

స్టేటు కాంగ్రెసు నాయకులనుంచీ, కాశేశ్వరరావు నుంచీ, కాంగ్రెసు అధ్యక్షుడు పట్టాభినుంచీ కమ్యూనిస్టులను అణచివేయాలనే ఆంతోళనా ప్రకటనలూ, నిందా ప్రచారమూ మిన్నుముట్టి పోతున్నవి. ఇందులో సోషలిస్టుపార్టీ నాయకులు గూడా చేతులు కలుపుతున్నారు.

హైదరాబాదు పదాతి దళం యీ చర్యలలో పాల్గొంటున్నదనీ, కమ్యూనిస్టులను, రైతువీరులను అసంఖ్యాకంగా అరెస్టు జేయటం, కాల్చివేయటం జరుగుతూన్నదని జనవరిలోనే వార్తలు వచ్చాయి. కమ్యూనిస్టుల నణచే యీ కార్యక్రమం ఒక విశాల ప్రాంతంలోని గ్రామీణ ప్రజానీకంపై ప్రకటించిన దారుణ యుద్ధంగా పరిణమించింది.

కాని, తమ దారుణాలను కప్పిపుచ్చుకోటానికి, ఎంత నిందా ప్రచారపు ముసుగు

వేసినా, పత్రికా విలేఖరుల వార్తలద్వారానూ ప్రభుత్వం తనకు తాను గతిలేక ఒప్పుకునే వాటిలోనూ నిజం బయట పడుతున్నది.

శ్రీ ప్రెస్ విలేఖరి యీ క్రింది విధంగా వ్రాశాడు:

"తెలంగాణా తారైంగంమీద కమ్యూనిస్టుల పలుకుబడి బలవత్తరంగావుంది. హైదరాబాదు రాజకీయాలలో ఇది ప్రధానపాత్ర వహిస్తుంది. నిజాం అధికారాన్ని, నిరంకుశత్వాన్నీ, నిర్బంధ విధానాన్నీ నిరంతరం తెలంగాణా కమ్యూనిస్టులు ప్రతిఘటించటం చెప్పుకోదగ్గ విజయం."

(శ్రీ ప్రెస్ జర్నల్ జనవరి 1.)

స్థానిక కాంగ్రెసువాదుల, పోలీసుల సహాయంతో జమీందార్లు తమ భూములను రైతుల నుంచి లాక్కుంటున్నారనీ, "నాయకులను చుట్టుముట్టటంలో ప్రభుత్వం ఎంత విజయం పొందినా అది పరిస్థితులను విషమింప జేసి తెలంగాణా రైతుల వ్యతిరేకతను పెంచుకోవటమే అవుతుం"దనీ ఆవిలేఖరే వ్రాశాడు.

ఈ మిలిటరీ పోలీసు చర్యలు హంతకుల మీదా, దోపిడి దొంగల మీదా కాక ఒక విస్తృత ప్రాంతంలోని ప్రజానీకమంతటి మీదా జరుపబడుతున్నాయనీ, ఆ ప్రజానీకం భూస్వామ్యవిధానం రద్దుచేసి దున్నేవాడికే భూమి యిచ్చిందనీ యిప్పుడు అధికారవర్గాలు కూడా అంగీకరిస్తున్నారు.

## అబద్ధాలపుట్ట

సంస్థానంలో కమ్యూనిజాన్ని రూపుమాపటం కోసం సమిష్టి చర్యలను గూర్చి చర్చించటానికై హైదరాబాదులో జరిగిన జిల్లా పోలీసు సూపరింటెండెంట్ల సమావేశాన్ని గురించి ఒక పత్రిక యీవిధంగా వ్రాసింది:

"వరంగల్ జిల్లాకు సంబంధించినంతవరకు ప్రతిగ్రామంలోనూ కమ్యూనిస్టు ప్రభావం పడింది. అక్కడి ప్రజలు తమకు కమ్యూనిస్టులు పంచియిచ్చిన పొలాలను విడిచిపెట్టడానికి అంత తేలికగా అంగీకరించరు. ఎంతగా అంచనా వేసినా వరంగల్, నల్లగొండ, జిల్లాలలోని యీ ప్రమాదాన్ని రూపుమాపటానికి ఆరు నెలలకంటె తక్కువకాలం పట్టను."

(హిందూ జనవరి 21)

మహత్తరమైన తెలంగాణా పోరాటాన్ని గురించిన వాస్తవాలు తెలుస్తున్నకొద్దీ, వీళ్ళ అబద్ధాలు బట్టబయలవుతాయి. ఒక వంక పత్రికలన్నీ, రజాకార్ కమ్యూనిస్టు కలియికను గూర్చి పేజీలకు పేజీలు అబద్ధాలు ప్రకటిస్తూ, తెలంగాణా వార్తలను అణచిపెట్టిన కాలంలో, నిజాం సైనికులూ రజాకార్లూ ప్రయోగించిన నిర్బంధ విధానాన్నంతటినీ తెలంగాణా రైతాంగమే భరిస్తూ వచ్చింది.

● మొత్తం వున్న తొంభైవేలమంది రజాకార్లలో ఇరవైవేలమందినీ, యాభైవేల సైన్యంలో పదివేలమందినీ నల్లగొండ, వరంగల్ జిల్లాలలో నైజాం కేంద్రీకరించాడు. ఈ రెండు జిల్లాల విస్తీర్ణం సంస్థానంలో ఎనిమిదోవంతు కంటె తక్కువ.

● ఈ రెండు జిల్లాలలోనూ, 1948 జనవరి సెప్టెంబరుల మధ్య తొమ్మిది

నెలల్లో రజాకార్లూ నిజాం సైనికులూ 1500 ప్రజలను చంపారు. 1000 స్త్రీలను చెరిచారు. 10 వేల యిండ్లు తగులబెట్టారు.

● ఈ కాలంలోనే తెలంగాణా రైతులు కమ్యూనిస్టు నాయకత్వాన గెరిల్లా దళాలుగా ఏర్పడి నిజాం పోలీసులనూ రజాకార్లనూ, దేశముఖుల ఏజెంట్లనూ 15 వందలమందిని హతమార్చారు. 10 వేల చదరపుమైళ్ళ వైశాల్యంగల రెండువేల గ్రామాల్లో నిజాం పరిపాలనను పూర్తిగా అంతరింపజేసి ప్రజాస్వామికంగా ఎన్నుకోబడిన గ్రామ పంచాయితీల కధికారమిచ్చారు. ఈ పంచాయితీలు దేశముఖుల, భూస్వాముల భూములను స్వాధీనంచేసుకొని, పేదరైతులకూ, వ్యవసాయ కూలీలకూ పంచిపెట్టాయి.

భారతసైన్యం హైదరాబాదులో ప్రవేశించిన వారంలో జరిగిన విశేషాలను కాంగ్రెసు పత్రికలు మరుగు పరిచాయి. ఆ తరువాత తెలంగాణా జిల్లాలలో పర్యటనజేసి వచ్చిన ఒక విలేఖరి అక్కడి పరిణామాలను గురించి ఇలా వ్రాశాడు :

“భారతసైన్యాలు హైదరాబాదులో ప్రవేశించడంతోపాటు తెలంగాణాలో, ఒక మహత్తరమైన ప్రజోద్యమం చెలరేగింది. అన్నింటికంటె ప్రధానంగా తెలంగాణా రైతులు రజాకార్ల మీద తమ ముట్టడులను తీవ్రతరంజేశారు. వేలకొలది రైతులు రజాకారుక్యాంపులను ముట్టడించి వాటిని పూర్తిగా నిర్మూలం చేశారు.

“చాలాచోట్ల రజాకార్లు ప్రతిఘటించినప్పుడు వాళ్లను మట్టుబెట్టడమో, ఖైదీలుగా పట్టుకోవడమో జరిగింది. కొన్నిచోట్ల తమ పరిస్థితి ప్రమాదంగా వుందని గుర్తించి రజాకార్లు పోరాటం లేకుండా ప్రజలకు లొంగిపోయారు. వారి దయాదాక్షిణ్యాలు అర్థించారు.”

భారత సైన్యం ప్రవేశించిన వారంలో రజాకారు క్యాంపుల మీద జరిగిన యిలాంటి దాడులను అనేకం యీ విలేఖరి ఉదహరించాడు. రైతులు రజాకారు క్యాంపులను ముట్టడించి నాశనంచేయటమే గాకుండా, పూర్వం రజాకార్ల అండతో రైతులను దోచి, దేశముఖులు కూడబెట్టిన ధాన్యాన్ని స్వాధీనం జేసుకున్నారు కూడా.

ఉదాహరణకు దోనకల్లులో వేలకొలది రైతులు నిజాం పోలీసు స్టేషను మీద దాడి చేసి దాన్ని తగులబెట్టారు. వెనక రజాకార్లు రైతులనుంచి దోచుకొన్న 16 వేలమణుగుల ధాన్యాన్ని 10 వేల మందికి పంచిపెట్టారు.

భారతసైన్యం నిజాముకు వ్యతిరేకంగా పురోగమిస్తున్న వారంలో వీరాధాన్యాన్ని స్వాధీనం చేసుకొని, ప్రజానీకానికి పంచిపెట్టటం తెలంగాణా అంతటా జరిగింది.

ఇంతేకాదు - ఈ ప్రజాఉద్యమం భూమి పంపకంలో ఎలా ప్రతిఫలించిందో ఈ విలేఖరి వివరించాడు.

“దుర్బలమైన అనేక కేంద్రాల్లోనూ లోగడ రజాకారు క్యాంపులు పెట్టిన గ్రామాల్లోనూ,

ఇంకా భూమిపంపకం జరుగని చోట్లల్లో వెంటనే భూమిపంపకం జరగాలని ప్రజలు పట్టుబట్టారు. ఒక్క నల్లగొండ తాలూకా లోనే 30_40 గ్రామాల్లో 5 వేల ఎకరాల పంపకం జరిగింది.

"దేవరకొండ తాలూకాలో అంతకు ముందు వుద్యమమనేదే లేని నడిగూడెంలాంటి అనేక గ్రామాలనుంచి వ్యవసాయ కూలీలు, పేదరైతులు పదిమంది నుంచి వందమందిదాకా రాయ బారాలుగా వచ్చి గెరిల్లా దళా లను, కమ్యూనిస్టు పార్టీని కలుసుకొని తమ గ్రామాలలో భూమి పంపకం జేయవలసిందిగా కోరారు.

"ఉద్యమం బలవత్తరంగా వున్న కేంద్రాలలో యింకా ఎక్కువ భూమిపంచాలని, ఒక ధనికరైతు తన క్రిందవుంచుకోదగిన భూమి గరిష్టపరిమితిని యింకా తగ్గించాలని కోరారు. వెనక గెరిల్లా దళాలుగానీ, బాల సంఘాలుగాని లేని గ్రామాల్లో సైతం గెరిల్లాదళాలు, బాల సంఘాలు వెలిశాయి."

## మహత్తరోధృతి

భారతసైన్య ప్రవేశంతోపాటు ప్రజలలో మహోధృతంగా చెలరేగిన నిజాం వ్యతిరేక ప్రతిఘటనా, భూస్వామ్య వ్యతిరేక ప్రజా స్వామిక పోరాటమూ, చూస్తే శిథిలమైన నిజాం నిరంకుశ జమీందారీ వ్యవస్థ ఎంత దుస్థితిలో వుందో తేటతెల్లమవుతుంది.

కార్మికులకుగానీ, వ్యవసాయ కూలీలకుగానీ కష్టపడే రైతాంగానికిగానీ, బస్తీలలోని అణగారిన మధ్యతరగతికిగానీ యావత్ప్రజానీకానికి నిజాం పరిపాలన క్రింద నిలవటం అసాధ్యమైపోయింది. వారు ఆ పరిపాలనపై తిరుగుబాటు చేసి నిజమైన ప్రజాస్వామికంకోసం పోరాటానికి సిద్ధపడ్డారు.

కార్మిక వర్గమూ, కమ్యూనిస్టు పార్టీలు ముందుకువచ్చి నిజాముకు వ్యతిరేకంగా, భూటి కోసం, కొంద్రకోసం పోరాడేప్రజానీకానికి రాజకీయ నాయకత్వం వహించి, ప్రజలను స్టేట్ కాంగ్రెసు, ఇండియన్ కాంగ్రెస్ నాయకుల అవకాశవాదాని కెరగారుండా వారిని కాంగ్రెసు మాయలోంచి విముక్తుల్ని జేసి ప్రజాస్వామిక విప్లవానికి పురోగమింప జేసిన తెలంగాణా ఒక్కటే చాలు దీనికినిదర్శనం.

కాని, యీ వుద్యమమంతా ఒక్క తెలంగాణా ప్రాంతంలోనే. తక్కిన ప్రాంతాలలో యీ వుద్యమం యింత వున్నత స్థాయికి రాలేదు. దీనికి ఒక కారణమేమంటే, కమ్యూనిస్టుపార్టీకి కార్మిక వర్గానికీ తెలంగాణా బయట నిర్మాణ రూపంలోగానీ, రాజకీయంగాగానీ తగినంత పలుకుబడి లేకపోవటం.

అక్కడ కమ్యూనిస్టులు బూర్జువా నాయకత్వం మీద ప్రజల్లో వున్న భ్రమలను తొలగించలేదు. చొరవ తీసుకొని నిజాముకూ, నిజాం సైన్యానికీ, వ్యతిరేకంగా పోరాటం నడిపి కాంగ్రెసు నాయకులు ఆటలు జరుపు

తూన్న రాజీపంథాను ఓడించగల స్థితిలో లేరు.

తెలంగాణాలో తప్ప సంస్థానాల్లోని తక్కిన అన్నిప్రాంతాల్లోనూ నిజాం వ్యతిరేక ప్రజాపోరాటంమీద కాంగ్రెసు నాయకత్వం జయప్రదంగా చన్నీళ్లు చల్లింది. ప్రజల్లో పూర్వమున్న చొరవలేకుండా చేసింది. నిజాముకు వ్యతిరేకంగా, సైనిక జోక్యం జరిగినప్పుడు ఆ ప్రజానీకం రంగంలోకి రాకుండా చేసింది. తమ రాజీవిధానానికి, ఉదయిస్తున్న ప్రజాస్వామిక విప్లవశక్తులకు వ్యతిరేకంగా అభివృద్ధినిరోధక కూటమిని గట్టిపరమకోటానికి ఆ ప్రజానీకాన్ని ఒక సాధనంగా వుపయోగించుకుంది.

—అందువల్లనే భారతసైన్యం తెలంగాణా చేరాక, మొట్టమొదట రజాకార్లనూ, దేశముఖులనూ యితర జమీందారీశక్తులనూ తన రక్షణలోకి తీసుకొని ప్రజల ఆగ్రహావేశాల నుంచి కాపాడింది.

— అందువల్లనే నిజాం లొంగిపోగానే, స్థానిక కాంగ్రెసువాదులతోనూ, దేశముఖుల ముఠాతోనూ అకస్మాత్తుగా కాంగ్రెసు వలంటీర్లూ నాయకులూ అయినవాళ్ళ గూండాలతోనూ కలిసి భారతసైన్యం తెలంగాణా గ్రామాలమీద ముట్టడి ప్రారంభించింది.

ఈదాడుల్లో భూమిని మళ్లీ దేశముఖులకూ, భూస్వాములకూ యిచ్చివేయాలనీ, కమ్యూనిస్టులను పట్టించాలనీ, ఆపాత జమీందారీ నిరంకుశులను తిరిగి గ్రామాలకు రానివ్వాలనీ "కాంగ్రెసు వలంటీర్లు" రైతాంగాన్ని ఒత్తిడి పెడుతున్నారు. ఇందుకు గ్రామస్థులు అంగీకరించక పోతే యిక ఆ గ్రామమంతా దగ్ధపటలమైందన్నమాటే–ప్రజలను విపరీతంగా కొట్టడం, వందల కొలదిగా రైతుల్ని అరెస్టుచెయ్యడం.

రెండు నెలల క్రితం తెలంగాణా జిల్లాలలో పర్యటనం చేసివచ్చిన ఒక పరిశీలకుని రిపోర్టునుబట్టి చూస్తే, కాంగ్రెసు వాలంటీర్ల ముసుగువేసుకున్న ఈ దేశముఖులూ వీళ్ళ గూండాలూ చేసిన దురంతాలు హృదయ విదారకంగా వున్నవి.

## పత్రికలకు కళ్లులేవు

ఊళ్లకుఊళ్లు నాశనంచేయటం, హత్యలూ, మానభంగాలూ, పోలీసు మిలిటరీ చర్యలతో ప్రారంభమయ్యే యీ ఘోర దురంతాలను గురించి పత్రికలలో ఒక్క అక్షరమన్నా లేదు. తెలంగాణా రైతాంగం, తమ భూమిని భూస్వాములపరం చేయటానికీ, పురాతన నిరంకుశత్వాన్ని శిరసావహించటానికీ, ఆ దోపిడి దొంగల నాహ్వానించటానికీ, అంగీకరించకపోతేసరి, యీ దురంతాలన్నీ ప్రత్యక్షమే!

ఈ దురంతాలను గురించి అక్షరం ప్రచురించకపోగా, కాంగ్రెసు అధీనంలోవున్న పత్రికలు తెలంగాణా ప్రజానీకంమీద సాగించే యీ దారుణ యుద్ధాన్ని సిగ్గువిడిచి సమర్థిస్తున్నాయి. కమ్యూనిస్టులు కాంగ్రెసువాదులను చంపి గ్రామాలను భయంతో ముంచెత్తుతూ వుంటే, యేదో రక్షణచర్య తీసుకొన్నట్టు కుటిల ప్రకటనలు చేస్తున్నాయి.

ఈ తప్పుడు ప్రచారంయొక్క లోతేమిటో కాలమే స్పష్టంచేసింది. తెలంగాణాను కొద్ది వారాలలో తుడిచిపెట్టేస్తామని భారతసేనానులు కొట్టిన ప్రగల్భాలు నిరర్థకమైపోవటం, వాళ్ళు స్వాధీనపరచుకొన్న భూములను మళ్లీ

వదలివెయ్యవలసి రావటం, ఈ వాస్తవాలే వాళ్ళు కమ్యూనిస్టులమీద వేసేనిందల అంతర్యాలను బయటపెడతాయి.

నాలుగుమాసాల ఘోర నిర్బంధవిధానం తెలంగాణా విప్లవ రైతాంగాన్ని లొంగదీయలేకపోయింది. తెలంగాణా రైతులు వెనక నిరంకుశాధికారులనూ, రజాకార్లనూ ప్రతిఘటించి ఎలా పోరాడారో, అలాగే ఇప్పుడు కూడా నిజాముకు క్రొత్తగా ఏర్పడ్డ యీ బూర్జువా రక్షకులను, జాగీర్దార్లనూ ఎదిరించి అజేపట్టుదలతో పోరాడుతున్నారు. పైచెప్పిన పరిశీలకని రిపోర్టునుంచి, అక్కడి రైతాంగం మాట్లాడేదేమిటో వుదహరిస్తాను.

“ఇప్పుడు లొంగిపోవటమంటే దుర్భర దారిద్ర్యంతోనూ, అవమానంతోనూ, క్రమంగా సమీపించే మృత్యువుతోనూ కూడిన ఆ పురాతన దాస్య జీవితాన్ని మళ్ళీ వరించట మన్నమాట. మేము సాధించిన ప్రయోజనాలను రక్షించుకొనేందుకు, పోరాడవలసి వుంది, పోరాడుతాం! నిజాం సైన్యాలచేతుల్లో భయంకర నిర్బంధవిధానాన్నీ, దురంతాలనూ మేము ఎదుర్కొన్నాం. ఈ భీభత్సాన్నికూడా ఎదుర్కొంటాం. కానీ, లొంగటం కల్ల.”

ఈ మనస్తత్వం నానాటికీ పెంపొందుతూ వున్నది. స్టేటుకాంగ్రెసు నాయకుల మీదగానీ భారత జాతీయ నాయకుల మీదగానీ, తెలంగాణా రైతాంగానికి ఏ భ్రమలూ లేవు. నిజామునూ, జాగీర్దార్లనూ చేరదీసే రక్షకులుగా మాత్రమే కాంగ్రెసు నాయకులను చూస్తున్నారు. ఖద్దరుటోపీలు పెట్టుకొన్న దేశముఖు గూండాలను “కాంగ్రెసు రజాకార్లని” పిలుస్తున్నారు.

తాముజరిపిన భూమిపంపకాన్ని కాపాడుకునే కోసం, తమ సంఘాల్లోనూ, గెరిల్లా దళాల్లోను, మరింత గట్టిగా సంఘటితపడుతున్నారు. ఇంతేగాదు. యిది వరకు రజాకారు క్యాంపుల నీడల్లో వున్న ప్రాంతాల్లోనూ. క్రొత్త క్రొత్త గ్రామాల్లోనూ కూడా భూమి పంపకం జరిగిపోతున్నది.

ఇదివరకే భూమిపంపకం జరిగినగ్రామాల్లో ఒక ధనికరైతు వుంచుకోదగిన భూమిగరిష్ట పరిమితి ఎక్కువగా వుందనీ, దాన్ని తగ్గించాలనీ, వ్యవసాయ కూలీలూ పేద రైతులూ ఆందోళన చేస్తున్నారు. ఈ ఉద్యమం క్రొత్త క్రొత్త గ్రామాలకు కూడా ప్రాకుతున్నది.

సంస్థానమంతటా ఆర్థిక సంక్షోభం పెచ్చు పెరుగుతూ. ప్రజల జీవిత పరిస్థితులు దుర్భరమైపోతూ, వాళ్ళ అసంతృప్తి పెరిగి కాంగ్రెసు నాయకత్వం మీదా, భారతప్రభుత్వం మీదా వాళ్ళ భ్రమలన్నీ పటాపంచలైపోతూన్న నేటి వాతావరణంలో తెలంగాణా ప్రజలమీద ఈ దారుణ యుద్ధమూ, దీన్ని తీవ్రంగా ప్రతిఘటించే ప్రజాపోరాటమూ జరుగుతున్నాయి.

నిజాముకు వ్యతిరేకంగా సైనిక జోక్యం వల్ల ఏదో ఒరిగి పడుతుందని ఆశలు పెట్టుకున్న ప్రజలందరూ ఈ నాలుగు నెలల అనుభవంతోటే కళ్లు తెరుస్తున్నారు.

భూస్వాములను కుదుట పరచటంకోసం రైతాంగంమీద నిర్బంధవిధానమూ, ప్రజల దుర్భర పరిస్థితులనుతొలగించటానికి అభ్యుదయ మార్గాలను అవలంబించ

టానికి నిరాకరణ, ఆహారపదార్థాల యితర అవసరవస్తువుల ధరల పెరుగుదల—ఇవన్నీ హైదరాబాదు బూర్జువా పరిపాలకులకు వ్యతిరేకంగా సర్వవ్యాపితమైన అసంతృప్తీ, ప్రజాపోరాటమూ ఏర్పాటయ్యే అవకాశాలు కల్పిస్తున్నాయి.

నిజాం ఏజేతలు తమ ఆటలు సాగటానికి ప్రధానమైన ఆటంకంగా గుర్తించిన తెలంగాణా పోరాటంలో అపజయం పొందటమే గాక, తక్కిన ప్రాంతాలలో తాము లోగడ మోసగించిన ప్రజల అసంతృప్తిని ఎదుర్కోవలసి వస్తున్నది.

తక్కిన ప్రాంతాలలోని ప్రజలు తెలంగాణా రైతుల వీరోచితపోరాటాన్ని అర్థంచేసుకొని చైతన్యంతో వాళ్ళుగూడా అదే మార్గాన్ని అనుసరించక ముందే, తెలంగాణాను తుడముట్టించాలని కాంగ్రెసు నాయకులు కోరుతున్నారనటానికి యేమీ సందేహంలేదు. పెట్టుబడిదారులూ, వాళ్ళ బంట్రోతులూ తెలంగాణాను విషప్రాయంగా ద్వేషిస్తారు. దాన్ని రూపుమాపటానికి యేపని చేయటానికైనా వెనుదీయరు. తెలంగాణావిప్లవసంప్రదాయం ధ్వంసమైపోయి, ప్రజల మనస్సులోంచి అది మరుగుపడిపోయి, హైదరాబాదు రైతాంగంయొక్క వీరోచితప్రతిఘటనకు అదిచిహ్నంగా నిలువకుండా నశించటంలోనే వాళ్ళ క్షేమంవుంది.

కానీ, తెలంగాణా ఉద్భవించటానికి కారణభూతమైన యుద్ధానంతర సంక్షోభం ఇంకా అంతరించకపోగా, తగ్గకపోగా, కొన్ని రెట్లు అతిశయించింది. కార్మికవర్గం నాయకత్వం వహించగలిగితే హైదరాబాదులోని పీడిత ప్రజానీకమంతా సమిష్టిపోరాటంలో కలిసే పరిస్థితులు మొట్ట మొదటిసారిగా ఇప్పుడే పరిపక్వ మవుతున్నాయి.

ఆర్థిక సంక్షోభ మధికమైన కొద్దీ, తమ పోరాటానుభవాల ద్వారా ప్రజానీకం బూర్జువా నాయకత్వం మీద భ్రమలు వీడిన కొద్దీ, ప్రజాస్వామికవిప్లవంకోసమై ప్రజల సమిష్టి పోరాటానికి అనుకూలవాతావరణం పెంపొందుతుంది.

తెలంగాణా ప్రజాస్వామిక పోరాటంలో సాధించిన విజయాలను దీక్షతో సంరక్షించుకోటం హైదరాబాదులోని కార్మిక వర్గం యొక్క, ప్రజాస్వామిక శక్తుల యొక్క ప్రధాన కర్తవ్యం. తతిమ్మా భారతదేశంలోని ప్రజాశక్తులన్నీ హైద్రాబాద్ ప్రజానీకంతో చేతులు కలిపి ఈ మహోద్యమం విజయవంతమయ్యేలా కృషిచేయాలి. తెలంగాణా వీర రైతాంగాన్ని నాశనం చేయజూస్తున్న అభివృద్ధి నిరోధక శక్తుల బండారాన్ని బట్టబయలు చేయాలి. తాము తెలంగాణాలో సాధించిన విజయాలను ప్రజానీకానికి తెలియజెప్పి, తెలంగాణాలోని నిర్బంధ విధానాన్ని నిరసిస్తూ ఒక ఉద్యమం తేవాలి. ఆ నిర్బంధ

విధానాన్ని ఉపసంహరించు కొనేట్టు ప్రభుత్వం మీద వత్తిడి తేవాలి.

ఈ సమిష్టిచర్యమీదనే - సంస్థానమంతటా ఒకేసారిగా ప్రజాపోరాటాలు అభివృద్ధి అయ్యే అవకాశంమీదనే హైదరాబాదు ప్రజాసామికోద్యంయొక్క, తెలంగాణా యొక్క భవిష్యత్తు ఆధారపడిఉంది.

("పీపుల్స్ ఏజ్" నుండి—30-1-49)



" భారతభూమికిజ్యోతి - తెలంగాణా !
నవభారతభూమికి నేత - తెలంగాణా !
పిలుస్తున్నదది వేరొకబాటకు - నేను తెలంగాణా!
విప్లవ సందేశా న్నందించే - వీరతెలంగాణా !!"

— మహాకవి మగ్దుం



"కొరడాదెబ్బలు, ఉరికంబాలు తప్ప ప్రజలకు ఏమీ ఇవ్వని ప్రభుత్వం నిలువజాలదు. నిర్బంధవిధానాలు ఎంత మామూలు అయిపోయాయంటే అవి ప్రజల్లో భీతికలిగించుట మానివేశాయి."

(సోవియట్ కమ్యూనిస్టుపార్టీ చరిత్ర. 5 అ. పేజ 2)

## బల్గేరియా కమ్యూనిస్టుపార్టీ అయిదో కాంగ్రెసులో

# కామ్రేడ్ డిమిట్రావ్

## రిపోర్టు

బల్గేరియా వర్కర్సు (కమ్యూనిస్టు) పార్టీ అయిదో కాంగ్రెసులో కేంద్రకమిటీ తరఫున కామ్రేడ్ డిమిట్రావ్ యిచ్చిన రాజకీయ రిపోర్టు ప్రధానభాగంలో, పార్టీ అభివృద్ధిలోని ప్రధాన దశలను గురించి వివరంగా విపులీకరించబడింది. ఈ మూడు దశాబ్దాలలోనూ, ముఖ్యంగా 1923 సెప్టెంబరులో జరిగిన తిరుగుబాటు అనంతరం అసలు బోల్షివిక్ తత్వం లేనివారందరికీ పార్టీనుండి ఉద్వాసనయిచ్చి పార్టీలోనూ, కార్మికోద్యమం లోనూ మితవాద, అతివాద ధోరణులకులాగే లిక్విడేషనిస్టులనూ, గ్రూపులనూ ఎదుర్కొంటూ, బోల్షివిక్ పార్టీ మహత్తరచరిత్రనుండి పాఠాలు నేర్చుకుంటూ, రోజురోజుకు తాను స్వయంగా పొందిన అనుభవాన్నుండి నేర్చుకుంటూ అభివృద్ధిచెంది చివరకు కార్మికవర్గానికి చైతన్యంతో కూడిన అగ్రగామిగానూ, మార్క్సిస్టు - లెనినిస్టు పార్టీగానూ ఏవిధంగా పరిణతి చెందిందీ వివరించాడు.

ఆ తరువాత పార్టీ దేశంలో సోషలిజాన్ని స్థాపించడానికి పార్టీ ఏవిధంగా పునాదివేసిందో కామ్రేడ్ డిమిట్రావ్ వివరించాడు.

బల్గేరియా వర్కర్సు (కమ్యూనిస్టు) పార్టీ కార్మికవర్గానికి అగ్రగామిగా నిలిబడి, మార్క్సిజం - లెనినిజంలో అకుంఠిత విశ్వాస ముంచి, తనకున్న విప్లవాత్మక అనుభవాన్నీ, సోవియట్ యూనియన్ అండనూ పురస్కరించుకొని 1944 సెప్టెంబరులో అధికారంలోకి

నున్న ఫాసిస్టు రాచరిక నియంతృత్వాన్ని సాయుధ పోరాటంద్వారా కూలద్రోయమని బల్గేరియా ప్రజలకు ఆదేశమిచ్చి, విజయాన్ని సాధించింది.

వీరోచిత సోవియట్ సైన్యానికీ, కామ్రేడ్ స్టాలిన్‌కూ, పార్టీ తరఫున, బల్గేరియా ప్రజల తరఫునా కామ్రేడ్ డిమిట్రావ్ సంతోష హర్షధ్వానులమధ్య కృతజ్ఞతాభివందనాలను తెలియ జేశాడు.

సెప్టెంబరు 9 వ తేదీన జరిగిన ప్రజల తిరుగుబాటు బల్గేరియాలో సోషలిజాన్ని నిర్మించడానికి మార్గాన్ని సుగమం చేసిందని కామ్రేడ్ డిమిట్రావ్ స్పష్టపరిచాడు. ప్రజల విజయమే దేశం రాజకీయంగానూ, ఆర్థికంగానూ అభివృద్ధి చెందడానికి అవసరమైన పరిస్థితులను సృష్టించింది. దేశంలో ప్రధానమైన మార్పులను తీసుకొనివచ్చి సృజనాత్మక కార్యక్రమంలో ప్రజలశక్తి వినియోగపడేటట్లు చేసింది.

## పెట్టుబడిదారీ విధానాన్ని సర్వనాశనం చేయనిదే పురోగమనం లేదు

జాతీయ అసెంబ్లీకి ఎన్నికలు జరిగి, మన పార్టీ ప్రత్యక్ష నాయకత్వాన ప్రభుత్వం ఏర్పడిన తరువాత పెట్టుబడి దారీవర్గ ఆర్థిక పునాదులను దెబ్బకొట్టకుండా ఉత్పత్తి శక్తులను అభివృద్ధి చేయడంగానీ, దేశం యొక్క ఆర్థికసంపత్తిని వృద్ధిచేయడంగానీ, కష్టజీవుల స్థితిగతులను బాగుపరచడం గాని పూర్తిగా అసంభవం.

పెట్టుబడిదారీ విధానం పతనమవుతున్న పరిస్థితులలో, బూర్జువా ప్రజాతంత్రం శాశ్వత సంక్షోభంలో యిరుక్కుపోయి ఫాసిజం తలెత్తడానికి అవకాశమిస్తున్న పరిస్థితులలో పెట్టుబడిదారీ విధానంయొక్క పునాదులనే పెకలించి, సోషలిజంవైపు పురోగమించకపోతే నిజమైన, శాశ్వతమైన, ప్రజాస్వామిక మార్పులు కొని రావడం అసంభవం. లెనిన్-స్టాలిన్‌లు చెప్పిన యీ సిద్ధాంతాన్ని బల్గేరియా అనుభవం దృఢపరచింది. మహత్తర సోషలిస్టురాజ్యమైన, సోవియట్ యూనియన్ స్నేహపూరితమైన సహాయ సంపత్తి లభించడంవల్ల మన దేశం సోషలిజంవైపుకు పురోగమించడానికి మరింత వీలైంది. (హర్షధ్వానులు)

మన జాతీయ ఆర్థిక విధానంలో విప్లవకర మార్పులనుగొనిరావడానికీ, పెట్టుబడిదారీ అభివృద్ధి నిరోధకుల ఆర్థికపునాదులను అంతం చేయడానికీ, పెట్టుబడిదారీ విధానాన్నుండి సోషలిజానికి పురోగమించడానికీ ప్రజా ప్రభుత్వం నిర్వర్తింపవలసిన కార్యక్రమాలకు మార్గం సుగమం చేయబడింది. అయితే పెట్టుబడిదారీ శక్తులను వ్యతిరేకంగా రాజీలేని వర్గపోరాటాన్ని కొనసాగించితేగాని యివంత సాధ్యపడదు.

ఈ పరిస్థితులలో పార్టీ తన నూతన విధానాలను సకాలంలో నిర్ణయించి తన క్యాడర్లకూ పితృభూమి సంఘటనకు (ఫాదర్ లాండ్ ఫ్రంటు) కష్టజీవులకూ ఖచ్చితమైన దృక్పథం ఏర్పడేటట్లు చూడవలసిన బాధ్యతఉంది. కాని యీ సందర్భంలో పార్టీ కొంత వెనకబడి పోయిందనే చెప్పాలి. ఈ దశకుపూర్వమున్న సమస్యలు పూర్తిగా పరిష్కారమైన తరువాత కూడా పార్టీ చాలవరకు వెనకటి తన పాత

వినాశాలతోనే కార్యక్రమాన్ని కొనసాగించడం సంభవించింది.

అభివృద్ధినిరోధకుల వ్యతిరేకతను నాశనం చేయడంలో మనం కొంత ఆలస్యానికి అవకాశమిచ్చాం. మన జాతీయ ఆర్థిక విధానంలో బడాపెట్టుబడిదారుల ఆధిపత్యాన్ని అంతము చేయడానికి అవసరమైన కార్యక్రమాన్ని కొనసాగించడానికి పరిస్థితులు పరిపూర్ణంగా పరిపక్వమయినప్పటికీ వ్యక్తిగత పెట్టుబడిదారుల, వర్తకుల ప్రయోజనాలతో మొత్తం దేశముయొక్క ప్రయోజనాలను సమన్వయపరచడానికి యింకా అవకాశం ఉన్నదనే చెప్పుతూ వచ్చాం. కాని మనదేశంలో సోషలిజానికి పునాదులువేసి, ముందుకు పురోగమించడానికి అవకాశమిచ్చే కొన్ని ప్రత్యేక పరిస్థితులుకూడా సానుకూలపడ్డాయి.

అయితే సోషలిజంవైపుకు పురోగమించే ప్రధాన దారినుండి మాత్రం మనం ఎన్నడూ తప్పిపోలేదు. ఫాసిజాన్ని నాశనంచేయడం, 1942 జూలై 14 వ తేదీ "పితృభూమి సంఘటన" కార్యక్రమంలో నివేదించిన సంస్కరణలను సాధించడమూ, మన అంతిమ ఆశయమైన సోషలిజం, కమ్యూనిజంలతో అత్యంత సన్నిహితంగా ముడిబెట్టబడి ఉన్నదనే విషయాన్ని మాత్రం మనం స్పష్టంగా అర్థం చేసుకొనేఉన్నాం. కాని ఆసమయంలో తీవ్రమైన సంస్కరణలను ప్రవేశపెట్టడానికి జాతీయ, అంతర్జాతీయ పరిస్థితులు అనుకూలంగా లేవనీ, సోషలిజంవైపు పురోగమించడానికి ఇంక మరికొంతకాలం పడుతుందని మనం అనుకున్నాం.

సెప్టెంబరు 9 వ తేదీన మనం ప్రారంభించిన విప్లవాత్మక చర్యల పరిణామం బడా పెట్టుబడిదారుల వ్యక్తిగత ఆస్తులను రద్దుచేయడానికి-కఠినచర్యలు తీసుకొనేటట్లు చేసింది. గ్రామసీమల్లో పెట్టుబడిదారీశక్తుల ప్రాబల్యాన్ని పరిమితిచేయడానికి రాజ్యాంగ యంత్రాన్ని పరిపూర్ణంగా శుద్ధిచేయడానికి ప్రోత్సాహపరిచింది.

మనదేశం ఆర్థికంగా, సాంఘికంగా, రాజకీయంగా అభివృద్ధికావడంలో కొంతఆలస్యం జరగడంమూలంగా మనం కార్మికవర్గం, ఇతర కష్టజీవులయొక్క శక్తినీ, పార్టీశక్తినీ తక్కువ అంచనా వేయడమూ, అభివృద్ధి నిరోధక ముఠాశక్తిని ఎక్కువ అంచనావేయడమూ సంభవించింది. అయితే యిది కొద్దికాలం మాత్రమే జరిగింది.

## మార్క్సిజం — లెనినిజాన్ని అధ్యయనం చేయవలసిన ఆవశ్యకత

కేంద్రకమిటీ 16 వ ప్లీనం సమావేశంలో ఉపహరించినట్లు మన పార్టీలో "మనం సోషలిజంవైపు ఎంత త్వరితంగా పురోగమించగలమో అనే విషయంలో తగినంత స్పష్టీకరణ లేదు." సెప్టెంబరు 9 న జరిగిన తిరుగుబాటును గురించి సంపూర్ణ సమగ్ర మార్క్సిస్టు - లెనినిస్టు పరిశీలనా దృష్టి మనలో లోపించింది. ప్రజావిజయం యిచ్చిన అవకాశాలను సరిగా అంచనా వేయక, ప్రజాతంత్ర రిపబ్లిక్‌లోని ముఖ్యదశలను గురించి గ్రహించే విషయంలో మందగొండితనం చూపెట్టడం జరిగింది.

కాని, అదృష్టవశాత్తూ యీ విషయంలో తగినంత సిద్ధాంత పరిజ్ఞానం లేక పార్టీ కొంత వెనకడుగు వేసినప్పటికీ, పరిస్థితులు తప్పని

సరిగా కల్పించిన కొన్ని నూతన సమస్యలను పరిష్కరించేందుకు ముందుకు రాగలిగింది.

సాంఘిక అభివృద్ధిలోని ప్రతిదశలోనూ మార్క్సిజం - లెనినిజాన్ని కార్యాచరణకు మార్గదర్శిగా సరిగా అన్వయించి పని చేయడంకంటే మార్క్సిజం-లెనినిజంయొక్క సిద్ధాంతాల్లో పాండిత్యాన్ని సాధించడం తేలికనే పాతసత్యాన్ని యీ మన అనుభవం మరొకసారి ధృవపరచింది. అతికష్టమైన యీ విద్య (మార్క్సిజం - లెనినిజం)లో పాండిత్యాన్ని సంపాదించాలంటే పార్టీనాయకులు పెద్దా చిన్నా - అంతా - విధి విరామం లేకుండా కృషిచేస్తూ, చురుకుదనముతో అధ్యయనం చేయవలసి ఉంటుంది. అప్పుడా పార్టీ అవసరమైన చర్యతీసుకొనే విషయంలో వెనకబడి పోవడంగానీ, లేక తొందరపాటుతో అవసరమైనదానికంటే ముందుకు పరుగెత్తడంగాని సంభవించదు.

బోల్షివిక్ మహాపార్టీకీ, ముఖ్యంగా కామ్రేడ్ స్టాలిన్ మనకు సకాలంలో అమూల్యమైన సలహాలనిచ్చి తోడ్పడినందుకు వారికి ఎప్పటికీ మనం కృతజ్ఞులమై ఉంటాం. (హర్షధ్వానులు). ప్రజాస్వామిక ప్రజాతంత్ర విప్లవ పోరాటంలో ప్రధానశక్తిగా మనపార్టీ అనుసరించాల్సిన పంథా విషయంలో ఎదుర్కొన్న అనేక సమస్యలలో వారు సలహాలివ్వడం మూలంగానే మనం చేసిన పొరపాట్లను వెంటనే సరిదిద్దుకోగలిగాం.

దేశంలోని రాజకీయ శక్తులలో వర్గాలలోని పరస్పర సంబంధాలలో వచ్చిన మహత్తరమైన మార్పులను గురించి ప్రస్తావించుతూ కామ్రేడ్ డిమిట్రావ్ సోవియట్ యూనియన్ ఎప్పటికప్పుడిచ్చిన సహాయ సంపత్తులు బల్గేరియాలో శక్తివంతంగానూ, ఆచరణ యోగ్యంగానూ సోషలిజానికి పునాదులు వేసే విషయంలో ఎంతో తోడ్పడ్డాయని నొక్కి చెప్పాడు.

“ఇదే మన పార్టీయొక్క ప్రస్తుత ప్రధాన పంథా. పట్టణాలలోనూ, పల్లెలలోనూ వున్న కష్టజీవులందరి అండగల కార్మికవర్గానికి పార్టీ నాయకత్వం వహించి గట్టిగా, దృఢసంకల్పంతో, తన విజయంలో అనంతమైన విశ్వాసముంచి ఇంటా బయటా ఎన్ని కష్టాలొచ్చినప్పటికీ లెక్కచేయకుండా ఎదుర్కొంటూ, సరియైన తన యీ పంథాను ఆచరణలో కొనసాగించి తీరుతుంది.”

# ప్రజాస్వామిక ప్రజాతంత్రం దాని స్వరూపమూ, పాత్ర

సోషలిస్టు రాస్తాలో మనం సంపూర్ణ విశ్వాసముంచి పురోగమించాలంటే ప్రజాస్వామిక ప్రజాతంత్రాన్ని గురించీ, వాటి స్వరూపం, పాత్ర, దృష్టికోణం - అన్నింటినీ మనం స్పష్టంగా తెలుసుకొని అర్థం చేసుకోవలసిన అవశ్యకత ఎంతో వుంది. ఈ నూతన సంక్లిష్టమైన సమస్యను గురించి మనలోగడ వున్న కొన్ని పొరపాటు అభిప్రాయాలను,

ప్రస్తుత పరిస్థితులనూ, ఇప్పుడు కొత్తగా తెలుసుకొన్న విషయాలను ఆధారం చేసుకొని పరిదిద్దుకొని, నిర్దిష్టమైన అభిప్రాయాలను ఏర్పరచు కోవాలి. ఈ సమస్య యొక్క సారాంశం సంక్షిప్తంలో ఏమిటి?

**1.** నాజీ - ఫాసిస్టుమూకల ఓటమి ఫలితంగా రెండో ప్రపంచయుద్ధంలో సోవియట్ యూనియన్ గడించిన చరిత్రాత్మక విజయం ఫలితంగా, జాతీయ స్వేచ్ఛాస్వాతంత్ర్యం కోసం ప్రజానీకం కార్మికవర్గ నాయకత్వాన పోరాడిన ఫలితంగా సామ్రాజ్యవాద వ్యవస్థ నుండి తూర్పు ఆగ్నేయ యూరప్ దేశాలు బయటపడటం సంభవించి, ప్రజాస్వామిక ప్రజాతంత్ర వ్యవస్థగల ప్రజాస్వామిక ప్రజాతంత్రరాజ్యం ఏర్పడటానికి అవకాశం లభించింది.

## ప్రజాస్వామిక ప్రజాతంత్రరాజ్యం

ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్య స్వరూపం నాలుగు ముఖ్యలక్షణాలచే నిర్ణయించబడుతుంది:

(అ) ప్రజాస్వామిక ప్రజాతంత్రరాజ్యం కష్టజీవులరాజ్యానికి - కార్మికవర్గం యొక్క నాయకత్వాన అత్యధిక సంఖ్యాకుల రాజ్యానికి ప్రాతినిధ్యం వహిస్తుంది.

**దీని అర్థమేమంటే: మొదట పెట్టుబడిదారుల, బడాభూస్వాముల పరిపాలన కూలద్రోయబడుతుంది. దీనిస్థానే కార్మికవర్గనాయకత్వాన పట్టణాలలోని, పల్లెలలోని కష్టజీవుల పరిపాలన ఏర్పరచబడుతుంది. ప్రస్తుత సమాజంలో అన్నిటికంటే అభ్యుదయకరమైన కార్మికవర్గం రాజ్యాంగములోనూ, ప్రజా జీవితంలోనూ ప్రధాన పాత్రను నిర్వహిస్తుంది. రెండోది: దోపిడీ వర్గాలనూ, పెట్టుబడిదారీ విధానాన్ని, బూర్జువా పరిపాలనను తిరిగి ఏర్పరచే ప్రయత్నాలనింటినీ, ఎదుర్కోవడానికి కష్టజీవులు జరిపే పోరాటంలో వారికి రాజ్యాంగాయంత్రము ఒక ఆయుధంగా వినియోగపడుతుంది.**

(అ) ప్రజాస్వామిక ప్రజాతంత్రరాజ్యం పరివర్తనదశలో వుండే రాజ్యాంగ విధానం. ఈదశలో దేశం సోషలిస్టురాష్ట్రంలో అభివృద్ధి అయ్యేందుకు ప్రజాస్వామిక ప్రజాతంత్రం హామీనిస్తుంది.

అంటే పెట్టుబడిదారుల, బడాభూస్వాముల పరిపాలన కూలద్రోయబడి, వారి ఆస్తులను ప్రజాపరం చేసినప్పటికీ పెట్టుబడిదారీ విధానంయొక్క మూలనాడులు ఇంకా ఛేదించబడలేదు. పెట్టుబడిదారీ శక్తులు తిరిగి తలెత్తుతూ పెట్టుబడిదారీ విధానాన్ని పునరుద్ధరించడానికి తంటాలుపడుతూవుంటాయి. **అందువలన సోషలిజంవైపుకు ముందుకు పురోగమించాలంటే పెట్టుబడిదారీశక్తులను సంపూర్ణంగా తుదముట్టించడానికి ఎడతెగని వర్గపోరాటాన్ని కొనసాగించడం మూలంగానే అది సాధ్యపడుతుంది.**

సోషలిజం వైపుకు ఎలాంటి సంకోచం లేకుండా పురోగమించడం మూలంగానే ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యం సుసం

ఘటితపడి తన చారిత్రాత్మక కర్తవ్యాన్ని నెరవేర్చ గలుగుతుంది. ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యం దోపిడీ వర్గాలకు వ్యతిరేకంగా పోరాడి, వారిని మట్టుపెట్టి పెట్టుబడిదారీ శక్తులను సమూలంగా నాశనం చేయకపోతే దోపిడీ వర్గాలు తప్పని సరిగా తిరిగి తలెత్తి ప్రజాస్వామిక ప్రజాతంత్రం యొక్క పునాదులను బలహీన పరచడమేగాక నాశనం కూడా చేయ గలుగుతాయి.

(ఇ) ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యం సోషలిస్టు భూమియైన సోవియట్ యూనియన్ స్నేహ పూరిత సహకారంతో నిర్మించబడుతుంది.

**మన దేశం సామ్రాజ్యవాదుల బానిస సంకెళ్ళనుండి విముక్తి పొంది, ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాన్ని నిర్మించుకోడానికి సోవియట్ యూనియన్ ఫాసిస్టు జర్మనీకి దాని తోడుదొంగలకూ వ్యతిరేకంగా జరిపిన విముక్తిపోరాటం ఎంతగానో సాయపడింది. అదే విధంగా నేడు మన దేశంలో ప్రజాస్వామిక ప్రజాతంత్ర వ్యవస్థ అభివృద్ధి పొందాలంటే మహత్తరమైన సోవియట్ యూనియన్‌కూ మన రాజ్యానికి పరస్పర స్నేహసహకారాలు ఉండితీరాలి. రెండు దేశాలకు మధ్య ఉన్న పరస్పర సహకారంతో కూడుకున్న సన్నిహిత సంబంధాలు మరింత బలపడాలి.**

సోవియట్ యూనియన్‌తో మనకున్న సన్నిహిత సంబంధాలు ఏ విధంగా సడలినా అది మన దేశంలో ప్రజాస్వామిక ప్రజాతంత్ర వ్యవస్థ పునాదులకే దెబ్బ తగిలేందుకు వినియోగపడుతుంది. (హర్ష ధ్వానలు)

(ఈ) ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యం సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజాస్వామిక కూటమికి చెంది ఉండాలి.

సోవియట్ యూనియన్ నాయకత్వాన వున్న సంయుక్త ప్రజాస్వామిక కూటమిలో పాల్గొనడం వల్లనే ప్రతి ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యమూ సామ్రాజ్యవాదుల దురాక్రమణనుండి తన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను కాపాడుకో గలుగుతుంది. అప్పుడే దానికి సరియైన రక్షణ ఉంటుంది.

## సోవియట్ యూనియన్ సహాయం

**2.** ఫాసిస్టు దురాక్రమణ రాజ్యాలు మిలిటరీ రీత్యా ఓడిపోయి పతనమైన పరిస్థితులలో, పెట్టుబడిదారీ విధానం తీవ్ర సంక్షోభంతో శిథిలమవుతున్న పరిస్థితులలో, సోవియట్ యూనియన్ బలం బ్రహ్మాండంగా వృద్ధి పొందిన పరిస్థితులలో నూతన ప్రజాతంత్ర రాజ్యాలు సోవియట్ యూనియన్- అత్యంత సన్నిహితసంబంధాలుకలిగిఉన్న పరిస్థితులలో- మన దేశమూ, ఇతర నూతన ప్రజాతంత్రరాజ్యాలూ సోవియట్ పరిపాలనా వ్యవస్థను ప్రవేశపెట్టకుండా ప్రజాస్వామిక ప్రజాతంత్ర వ్యవస్థ ద్వారానే పెట్టుబడిదారీ విధానాన్నుండి సోషలిజానికి పరివర్తన చెందడానికి వీలుకలిగింది. సోవియటు యూనియన్ ఇతర నూతన ప్రజాతంత్రరాజ్యాల సహాయ సంపత్తులు ఉన్న పక్షంలోనే ప్రజాస్వామిక

ప్రజాతంత్రవ్యవస్థ సంఘటితపడి అభివృద్ధి కావడానికి అవకాశం కలుగుతుంది.

**3. కార్మికవర్గ నాయకత్వాన కష్టజీవుల పరిపాలనను తనలో ఇముడ్చుకొని ప్రజాస్వామిక ప్రజాతంత్ర వ్యవస్థ ప్రస్తుత చారిత్రక పరిస్థితులలో పెట్టుబడిదారీశక్తులను మట్టుబెట్టి, సోషలిస్టు ఆర్థిక విధానాన్ని సంఘటితపరచే శ్రామికవర్గనియంతృత్వ పాత్రను చక్కగా నిర్వహించగలుగుతుంది. నిర్వహించాలికూడా. ఈ యదార్థం అప్పుడే మన అనుభవము ధృఢపరచింది. (హర్షధ్వానులు)**

ప్రజాస్వామిక ప్రజాతంత్ర వ్యవస్థ అధికారాన్నుండి కూలద్రోయబడిన పెట్టుబడిదారుల, బడా భూస్వాముల ప్రతిఘటనను ఎదుర్కొని, అణచి తిరిగి పెట్టుబడిదారీ ప్రభుత్వాన్ని పునరుద్ధరించడానికి వారు చేసే ప్రయత్నాలను తుదముట్టించగలదు. ఆపైన ప్రజలందరి యాజమాన్యాన ఉండే పరిశ్రమలను నిర్మించి సుసంఘటిత ఆర్థిక విధానాన్ని ప్రవేశపెట్టగలదు. అంతేకాదు. గ్రామాలలో వుండే పెట్టుబడిదారీ శక్తులనుకూడా ఎదుర్కొని కార్మికవర్గానికి అండగా కష్టజీవుల్లో అత్యధిక సంఖ్యాకులను సమీకరించి సోషలిస్టు విధానంలోకి సమాజం పరిణితి చెందడానికి ప్రజాస్వామిక ప్రజాతంత్ర విధానం ధృఢంగా పోరాడగలిగి ఉంటుంది.

జాతీయ ఆర్థికవిధానాన్నుండి పెట్టుబడిదారీ శక్తులను పారద్రోలే పాలసీనీ ప్రజాస్వామిక ప్రజాతంత్ర ప్రభుత్వం అనుసరించేటప్పుడు తప్పనిసరిగా వ్యతిరేకత రాకుండా మానదు.

**రాజ్యాంగంలోనూ, ప్రజాజీవితంలోనూ కార్మికవర్గానికున్న కీలకస్థానాలను ఎప్పటికప్పుడు బలపరుచుకుంటూ ఉండాలి. గ్రామసీమల్లో ధనికరైతులకూ, వారి ఏజెంట్లకూ వ్యతిరేకంగా జరిగే తీవ్రతరపోరాటంలో కార్మికవర్గానికి అండగా గ్రామీణశక్తులను సమీకరించాలి.**

వర్గశత్రువులను పరిమితులలోవుంచి, రద్దు చేసేందుకు ప్రజాస్వామిక ప్రజాతంత్ర విధానాన్ని బలపరచుకుంటూ అభివృద్ధి చేయాలి.

**4.** స్వదేశ, ముఖ్యంగా విదేశ శత్రువులకు వ్యతిరేకంగా ఎడతెగని పోరాటాన్ని సాగించుతూ, నూతన ప్రజాతంత్రరాజ్యాలు అప్పుడే సోషలిజానికి పురోగమిస్తున్నాయి. సోషలిజాన్ని నిర్మించడానికి అవసరమైన పరిస్థితులనూ, భవిష్యత్తులో సోషలిస్టు సమాజానికి అవసరమైన ఆర్థిక, సాంస్కృతిక పునాదులను నూతన ప్రజాతంత్రరాజ్యాలు సృష్టిస్తున్నాయి.

నూతన ప్రజాతంత్ర రాజ్యాలను నేడు ఎదుర్కొంటున్న ప్రధాన బాధ్యత ఇదే. దీనినే కార్మికవర్గమూ, దీని అగ్రగామి అయిన కమ్యూనిస్టు పార్టీ నెరవేర్చవలసివుంది.

పార్టీ నెరవేర్చవలసిన యీ ప్రధాన బాధ్యతలోనే కొన్ని ముఖ్యాంశాలు యిమిడి ఉన్నాయి. అందులో యీక్రింద ఉదహరించిన వాటికి మరింత ప్రాముఖ్యతవుంది:

(అ) రాజ్యాంగంలోని అన్ని శాఖలలోనూ, సాంఘిక, రాజకీయ సాంస్కృతిక జీవితంలోనూ కమ్యూనిస్టుపార్టీ ఆధిపత్యాన నడుస్తున్న కార్మికవర్గానికిగల కీలకస్థానాలను ఎప్పటికప్పుడు సంఘటితపరచుకోవాలి.

(ఆ) కార్మికవర్గానికీ రైతాంగ కష్టజీవులకు మధ్యనున్న ఐకమత్యాన్ని కార్మికవర్గం యొక్క నాయకత్వాన మరింత బలపరచుకోవాలి.

(ఇ) జాతీయ ఆర్థిక విధానంలో ముఖ్యంగా భారీ పరిశ్రమల అభివృద్ధిని మరింత త్వరితంచేయాలి.

(ఈ) వ్యవసాయరంగంలో పెట్టుబడిదారీ దోపిడివర్గాలను తుదముట్టించడానికీ అవసరమైన పరిస్థితులను సృష్టించాలి. ఇందుకు ఆ శక్తుల ప్రాబల్యాన్ని పరిమితి చేస్తూ చివరకు నాశనం చేసే పాలసీని అనుసరించాలి.

(ఉ) రైతాంగంలో ఉత్పత్తి సహకార సంస్థలను అన్ని విధాలా అభివృద్ధి చేయాలి. పేద, మధ్యతరగతి రైతులకు మెషిన్ ట్రాక్టర్ల స్టేషన్లద్వారానూ, ఋణాల్నివ్వడంద్వారాను, విత్తనాలు సరఫరా చేయడంద్వారానూ ప్రభుత్వం సహాయం చేయాలి. రైతాంగం కార్మికవర్గంతో ఐక్యమై కలిసి పనిచేసేందుకు ప్రోత్సాహించాలి. సమిష్టి వ్యవసాయ పద్ధతులవలన ఉన్న ప్రయోజనాలను ఉదాహరణల ద్వారా రైతులకు నచ్చచెప్పాలి. పెట్టుబడిదారీవర్గాలతో రైతాంగానికి పొత్తుకుదరదనే విషయాన్ని బోధించాలి. ఈ రెండు వర్గాలకూ ఎల్లప్పుడూ ఎడమొగమూ, పెడమొగమూ అనే విషయాన్ని నచ్చచెప్పాలి.

మనం సహకార వ్యవసాయ క్షేత్రాలను అభివృద్ధి చేసుకొంటున్న యీ పరిస్థితులల్లో భూమిని జాతిపరంచేసే సమస్యకు ఆచరణలో ఏమాత్రం ప్రాముఖ్యతలేదు. అంటే వ్యవసాయాన్ని ఆధునిక పరికరాల సహాయంతో వృద్ధి చేయడానికి భూమిని జాతిపరం చేయడం అత్యవసరం కాదు.

డిమిట్రావ్ యింకా యిలా చెప్పాడు:

పల్లె ప్రాంతాలలో సోషలిజాన్ని నిర్మించడం సామాన్యంగా భూమిని జాతిపరం చేయకుండా సాధ్యం అవుతుందని నేను పైన చెప్పిన దానిని బట్టి భావించరాదు.

ఈ విధంగా పేదరైతులనూ, మధ్య తరగతి రైతులను క్రమంగా సహకార వ్యవసాయ పద్ధతుల వైపుకు మొగ్గేటట్లు చేసి, మెషీన్ ట్రాక్టర్ స్టేషన్లు అభివృద్ధిచేసి భూముల క్రయవిక్రయాలను పరిమితం చేస్తూ ఆ తరువాత నిషేధించి రైతుసహకారసంఘ నిర్వాహకుల చేతులతోనే శిస్తులను రద్దుచేసేటట్లుచేసి - ఇవన్నీ జరిగి పరిస్థితులు పరిపక్వమైనప్పుడు భూమి జాతిపరంచేసే విషయం ఆచరణలో పరిష్కారమవుతుంది. అంటే శాశ్వతంగా భూమంతా సహకార వ్యవసాయక్షేత్రాల అధీనంలోనే ఉండిపోతుంది.

ఈవిధంగా తన కొద్దిపాటి కోండ్రకు బానిసగావుంటున్న కష్టజీవి రైతు భూమి యిచ్చే ఫలితాన్ని సంపూర్ణంగా అనుభవించ గలుగుతాడు. ఆధునిక వ్యవసాయక యంత్రాల సాయంతో పెద్దపెద్ద సహకార వ్యవసాయ క్షేత్రాలను సాగుచేయడం మూలంగా పంట అధికమవుతుంది.

**5.** ప్రజాస్వామిక ప్రజాతంత్రం అంతర్జాతీయతకు ఆలవాలమై ఉంటుంది. (సంకుచిత) జాతీయతతో ప్రజాస్వామిక ప్రజాతంత్రానికి సరిపడదు. మనపార్టీ దృష్టిలో అంతర్జాతీయ తత్వం అంటే - స్టాలిన్ మహాశయుని నాయకత్వాన అంతర్జాతీయ సహకారం; మనదేశం సోషలిజంవైపుకు పురోగమిస్తూ భాగ్యభోగములతో అభివృద్ధిచెందడం. జాతీయత - అది ఏముసుగులో వున్నప్పటికీ - కమ్యూనిజానికి బద్ధశత్రువుగా మనం భావిస్తాం. యుగోస్లావియాలో టిటో జాతీయమతా కమ్యూనిస్టు వ్యతిరేకచర్యలలో ఇది స్పష్టంగా ప్రదర్శితమయింది. కాబట్టి జాతీయతత్వాన్ని ఎదుర్కోవడం కమ్యూనిస్టులయొక్క ప్రధాన కర్తవ్యం.

జాతీయతత్వం యొక్క అన్ని రూపాలనూ మనం ఎదుర్కొంటూ కష్టజీవులందరికి శ్రామికవర్గ అంతర్జాతీయ దృష్టి అలవడేటట్లు కృషి చేయాలి. అంటే వారిని నిజమైన దేశభక్తులుగా తర్ఫీదు చేయాలి.

శ్రామికవర్గ అంతర్జాతీయ భావాలను పెంపొందించడం, తన దేశంయెడల భక్తి భావాన్ని కలుగజేయడం అంటే అర్థం అంతర్జాతీయ సామ్రాజ్యవాద దురాక్రమణ శక్తుల యొక్క దాడికి వ్యతిరేకంగా మహత్తరమైన సోవియట్ యూనియన్, నూతన ప్రజాతంత్ర రాజ్యాలు కలిసి దృఢమై ఐక్యసంయుక్త సంఘటనగా ఏర్పడవలసిన ఆవశ్యకతను ప్రజలు పూర్తిగా గ్రహించేటట్లు చేయడమన్నమాట.

మన ప్రజల 'యావత్తు భవిష్యత్తూ ఒక వైపున సోవియట్ యూనియన్ బలంపై ఆధారపడివుంది. అందువల్లనే సోవియట్ యూనియన్ స్నేహహస్తాన్ని ఎంతోగాఢంగా మనం వాంఛించుతున్నాం. మరొకవైపున పెట్టుబడిదారీవర్గ దురాక్రమణ జరిపేపక్షంలో పోరాటంలో తమ ధర్మాన్ని గౌరవపూర్వకంగా నిర్వర్తించేందుకు మన ప్రజలు ప్రదర్శించేశక్తి సంసిద్ధతలపై ఆధారపడి ఉండి.

(హర్షధ్వనులు)

అదేసమయంలో శ్రామికవర్గ అంతర్జాతీయ తత్వాన్ని ప్రజలకు అలవడేటట్లు చేయడమంటే వివిధ కమ్యూనిస్టుపార్టీల కార్యకలాపాలలో సంపూర్ణమైన సహకారంఉండి తీరవలసిన ఆవశ్యకతను ప్రజలు పూర్తిగా గ్రహించేటట్లు చేయడమన్నమాట. ఇందులో బోల్షివిక్ పార్టీకున్న నాయకత్వ పాత్రను కూడా ప్రజలు గుర్తించేటట్లు చేయవలసి ఉంటుంది.

ఎందువల్లనంటే కమ్యూనిస్టు పార్టీలన్నింటి కార్యాచరణకు మార్గదర్శకంగా ఒకేఒక సిద్ధాంతం-మార్క్సిజం-లెనినిజం సిద్ధాంతం ఉంది; తమ పాలసీకి ఒకే ఒక గమ్యస్థానం ఉంది. అంతర్జాతీయ కార్మికోద్యమానికి ప్రధాన నాయకత్వం వహించే పార్టీ - లెనిన్ స్టాలిన్‌ల మహత్తరపార్టీ వుంది.

మనం విజయం పొందాలంటే ఒక ముఖ్య విషయం ఉంది. అదేమంటే పార్టీనీ, కార్మికవర్గాన్నీ కష్టజీవులైన రైతాంగాన్నీ, శ్రామిక మేధావంతులందరినీ, యావత్తు కష్టజీవులనూ పైతత్వంలో భయంలేకుండా ఓపికతో తర్ఫీదు నివ్వవలసిన ఆవశ్యకత.

# అంతర్జాతీయ పరిస్థితి

అంతర్జాతీయ పరిస్థితులను గురించి కామ్రేడ్ డిమిట్రావ్ ప్రస్తావించుతూ వర్తమానయుగంలో స్పష్టంగా అగుపడే రెండు ప్రధానలక్షణాలనుగురించి వివరించాడు :

1. పెట్టుబడిదారీ విధానంలో సర్వతో వ్యాప్తమైన సంక్షోభమూ, పతనావస్థా.

2. సోవియట్ యూనియన్‌లో సోషలిజం మూడుపువ్వులూ, ఆరుకాయలుగా అభివృద్ధిచెందుతూ వృద్ధిపొందడమూ.

పెట్టుబడిదారీ విధానంలో వచ్చిన సర్వవ్యాప్తి సంక్షోభానికి కారణం అసలు ఆ పెట్టుబడిదారీ విధానంలోనే యిమిడిఉంది. అది దాని సహజపరిణామం. సమాజంయొక్క ఉత్పత్తిశక్తిని యిదివరకెన్నడూ లేనంతగా పెంచిన తరువాత పెట్టుబడిదారీవిధానం తనలో యిమిడివున్న పరస్పర విరుద్ధతలలో తగులుకొనిపోయింది. ఈ పరస్పర విరుద్ధతలను పరిష్కరించుకొనేశక్తి దానికిలేదు.

1914–18 లోని ప్రథమ ప్రపంచ సామ్రాజ్యవాదయుద్ధం పెట్టుబడిదారీ విధానం బ్రహ్మాండమైన సంక్షోభంలో మునిగివున్న సమయంలోనే జరగడం సంభవించింది. రష్యాలో జరిగిన అక్టోబరు సోషలిస్టు మహావిప్లవం ప్రపంచ పెట్టుబడిదారీ విధానాన్నుండి ప్రపంచ భూభాగంలోని ఆరోవంతుభాగాన్ని విముక్తి చేసింది. దానితో పెట్టుబడిదారీ విధానం ప్రపంచలో సర్వవ్యాప్తి గల ఏకైక ఆర్థిక విధానము కాకుండాపోయింది. తనకు అదివరకున్న స్థిరత్వాన్ని కోల్పోయింది

అంతర్జాతీయ అభివృద్ధినిరోధకుల, ఫాసిస్టు దురాక్రమణదారుల కుట్రలు ఫలితంగా వచ్చిన రెండో ప్రపంచయుద్ధం పెట్టుబడిదారీ విధానంలోవున్న సర్వతోవ్యాప్తి గల సంక్షోభాన్ని మరింత తీవ్రపరచి అధికం చేసింది. ప్రథమ ప్రపంచయుద్ధకాలంలో జరిగినట్లుగానే యీ యుద్ధంకూడా మొత్తం పెట్టుబడిదారీ విధానాన్ని మరింత బలహీనపరచడానికే దారితీసింది.

ఫాసిజానికీ, ప్రపంచ దురాక్రమణకూ ప్రధాన కేంద్రాలైన జర్మనీ, ఇటలీ, జపానులు నాశనం కావడంమూలంగా, అంతర్జాతీయ అభివృద్ధి నిరోధకులకు సోవియట్ యూనియన్‌ను, ప్రజాస్వామికాన్ని సోషలిజాన్నీ, కార్మికవర్గాన్నీ, జాతీయ విముక్తి ఉద్యమాలను దెబ్బతీయడానికి ప్రధాన సాధనాలు లేకుండా పోయినాయి. అంతేకాదు. ఫాసిస్టు దేశాలలోకూడా పెట్టుబడిదారీ విధానం లేకుండా పోయింది.

అంతర్జాతీయంగా సోవియట్ యూనియన్‌కు పేరు ప్రతిష్టలు ఇనుమడించాయి. దానిబలం విపరీతంగా పెరిగింది. తన వీరోచిత పోరాటంద్వారా సోవియట్ యూనియన్ తన స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను రక్షించుకోవడమేగాక యూరప్ ప్రజలను బానిసత్వాన్నుండి విముక్తిచేసింది.

దురాక్రమణదారులను దుమ్మాడి విజయం సాధించడంలో

సోవియట్ యూనియన్ అత్యంత ప్రముఖపాత్రను నిర్వహించి, ఫాసిస్టు మూకలనుండి నాగరికతను కాపాడింది. దానితో సోషలిస్టు, ప్రజాస్వామిక శక్తులు అజేయమని ప్రపంచానికంతకూ స్పష్టపడింది.

అంతర్జాతీయ రాజకీయాలలో సోవియట్ యూనియన్ ఒక నిర్ణయశక్తిగా తయారయింది. జాతుల శాంతిభద్రతలకూ నిజమైన ప్రజాస్వామిక అభ్యుదయాల వైపుకు అవి పురోగమించడానికీ సోవియట్ యూనియన్ ఒక మూలస్థంభమయింది. అంతర్జాతీయ అభివృద్ధినిరోధకులు ప్రజలపై మరొక నూతన ప్రపంచయుద్ధాన్ని తెచ్చిపెట్టడానికి పన్నే దుష్టపన్నాగాలకు సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రపంచ సంయుక్త సంఘటనకు నాయకత్వం వహిస్తున్న సోవియట్ యూనియన్ అధిగమించలేని ఒక అడ్డంకుగా పరిణమించింది.

ప్రథమ ప్రపంచయుద్ధంతో ప్రపంచ పెట్టుబడిదారీ విధానాన్నుండి రష్యా విముక్తి పొందింది. అదేవిధంగా రెండో ప్రపంచ యుద్ధంలో ఫాసిస్టుల ఓటమితో అనేక తూర్పు యూరప్ దేశాలు పెట్టుబడిదారీ సంకెళ్ళనుండి విముక్తిపొందాయి. సోవియట్ యూనియన్ సహాయంతో విముక్తిపొందిన యీరాజ్యాలు తమప్రజలు స్వేచ్ఛగా నిర్ణయించుకొన్నవిధంగా తమ భవిష్యత్తును నిస్వార్థమైన సోవిట్ సహాయంపై ఆధారపడి నిర్మించుకోగలుగుతాయి.

వలసవిధానంలో వున్న సంక్షోభాన్ని రెండో ప్రపంచయుద్ధం మరింత తీవ్రతరంచేసింది. దీనితో వలసదేశాలలోనూ, అధీనదేశాల్లోనూ జాతీయ స్వాతంత్ర్యోద్యమాలు బ్రహ్మాండంగా విజృంభించి సామ్రాజ్యవాద అస్తిత్వానికే ఎసరుపెట్టాయి. వలసదేశాలలోని ప్రజలు పాతవిధానంలో జీవించడానికి ఇంకెంతమాత్రం సహించడం లేదు. తమ తమ దేశాలలో స్వేచ్ఛాస్వాతంత్ర రాజ్యాలను నెలకొల్పుకోనేందుకు వీరోచితంగా తీవ్రతర పోరాటాలను సాగిస్తున్నారు.

పెట్టుబడిదారీ ప్రపంచమంతటా యుద్ధ ఫలితంగా యిదివరకెన్నడూ కనీ వినీ ఎరుగనంత దారుణంగా ప్రజలు దరిద్రులయ్యారు. నిరుద్యోగం, కరువు, ఆకలిబాధా యిరుమడించాయి. వర్గవైరుధ్యాలు మరింత తీవ్రతరమయ్యాయి. ఎందువల్లనంటే ప్రతిచోటా బూర్జువావర్గం మోయలేని యుద్ధభారాన్ని యుద్ధానంతర కష్టాలనూ కష్టజీవులపై రుద్దడానికి ప్రయత్నించింది. అదే సమయంలో మరొకవైపున యుద్ధంమూలంగా అంతర్జాతీయ కార్మికోద్యమంలో అపూర్వ చైతన్య పోరాట శక్తులు వెల్లివిరిసాయి.

ఫాసిస్టు దురాక్రమణదారులను సర్వనాశనం చేసిన తరువాత ప్రపంచ అభివృద్ధినిరోధక ముఠా కేంద్రం అమెరికాకు మారింది. ప్రపంచాన్ని బానిసత్వంలో ముంచడానికి హిట్లర్

ప్లానులను పన్నారు. కాని గత యుద్ధంలో ఆ ప్లానులు విఫలమయ్యాయి. తిరిగి అమెరికా సామ్రాజ్యవాదులు ప్రపంచాధిపత్యాన్ని సంపాదించడానికి అంతకంటె ఇనుమిక్కిలి ప్లానులను వేస్తున్నారు.

## అమెరికా ప్లానులు

“మార్షల్ ప్లానూ”, “ట్రూమన్ సిద్ధాంతము” అనే ముసుగుతో యూరప్‌నూ, ప్రపంచమంతటినీ ఆర్థికంగా, రాజకీయంగా, సైద్ధాంతికంగా బానిసత్వంలో ముంచే ప్లానులన్నీ అత్యధిక సంఖ్యాకులైన దేశాల ప్రజల ప్రయోజనాలకు పూర్తిగా విరుద్ధమైనవి. ‘ఈ ప్లానులన్నింటికీ మూలాధారం కోటీశ్వర్లయిన పాలకవర్గాల పేరాశమాత్రమే. అంతేకాదు. సోషలిజం’ ప్రజాస్వామిక ప్రజాతంత్రము, దినదినాభివృద్ధి చెందడంతో ఖంగారుపడి వాటి నణచడానికి యీ ప్లానులను పన్నుతున్నారు.

“పశ్చిమ ప్రజాతంత్రం” అన్న తియ్యటి పదాల ముసుగులో అమెరికా సామ్రాజ్యవాదులే తమ డాలర్ పెత్తనాన్నీ, కొద్దిపాటి గుత్త పెట్టుబడిదారుల ఆధిపత్యాన్ని యూరప్ దేశాలపైన రుద్దడానికి ప్రయత్నించుతున్నారు. మిత్రరాజ్యసమితిని తమ దురాక్రమణ విధానానికి కీలుబొమ్మగా వినియోగపడేటట్లు చేయ నుద్దేశించి అమెరికన్ డాలర్ సామ్రాజ్యవాదులు సమితిలో సభ్యులైన రాజ్యాలకు గల సమాన, స్వాతంత్ర్యహక్కులను వమ్ముచేయడానికి ప్రయత్నిస్తున్నారు.

చిన్నరాజ్యాలను, యుద్ధఫలితంగా తాత్కాలికంగా బలహీనపడిన దేశాలను అమెరికా సామ్రాజ్యవాదులు తమ బానిసత్వంలో వుంచుకొని, సోవియటు యూనియన్‌కూ నూతన ప్రజాతంత్ర రాజ్యాలకూ, కష్టజీవుల విప్లవోద్యమాలకూ, తమ స్వాతంత్ర్యంకోసం పోరాడుతున్న వలసదేశాల ప్రజల పోరాటాలకూ వ్యతిరేకంగా ఒక సామ్రాజ్యవాద కూటమిని నిర్మించడానికి ప్రయత్నించుతున్నారు.

అమెరికా తన ఇష్టమొచ్చినట్లుగా ఆయుధబలాన్ని పెంచుతోంది. ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులు మామూలు అంతర్జాతీయ 78 సూత్రాలనుసైతం త్రోసిపుచ్చి ఇతర దేశాల ఆంతరంగిక విషయాలలో జోక్యం కల్పించుకుంటూ, ప్రతిచోటా ప్రజలచే అసహ్యహించుకోబడి నిరాకరించబడిన అభివృద్ధినిరోధకవర్గాలనూ, పచ్చి ఫాసిస్టుశక్తులనూ బలపరుస్తున్నారు. మన పొరుగునున్న గ్రీస్ దేశమే దానికి ప్రత్యక్ష తార్కాణం.

కాని రెండో ప్రపంచయుద్ధం ముగియగానే ఏర్పడిన ఆంగ్లో అమెరికన్ కూటమి (ఇందులో జూనియర్ భాగస్తురాలు) శాశ్వతంగానూ, స్థిరంగానూ వుండలేదు. ఈరోజున ప్రధాన సామ్రాజ్యవాదదేశాలైన అమెరికా బ్రిటన్‌ల మధ్యా, యితర పెట్టుబడిదారీదేశాల మధ్యా వున్న వైరుధ్యాలు మార్కెట్లకోసం యితర దేశాలపై ఆధిపత్యాన్ని సంపాదించడానికి జరిగే పోరాటాలలో తప్పనిసరిగా మరింత తీవ్రతరమవుతాయి.

ఈనాడు ప్రపంచ రాజకీయ రంగంలో ప్రజాస్వామిక కూట

మికీ, అభివృద్ధినిరోధకుల కూటమికీ – యుద్ధోన్మాదులకూ, శాశ్వత ప్రజాతంత్ర శాంతి కాముకులకూ మధ్య సోవియట్ యూనియన్ ఎడల ప్రదర్శించబడే వైఖరే ఖచ్చితమైన గీటురేఖ.

సామ్రాజ్యవాదుల దురాక్రమణ ఎత్తుగడలనూ, యాటంబాంబులను చూపెట్టి ప్రజలను భయపెట్టే యత్నాలను సోవియట్ యూనియన్ ధృఢతరంగా ప్రతిఘటిస్తోంది. వివిధ దేశాల ప్రజలమధ్య శాంతినీ, స్నేహపూర్వక సహకారాన్ని పెంపొందించే పంథాను సోవియట్ యూనియన్ తదేకదీక్షతో అమలు జరుపుతోంది. సోవియట్ యూనియన్ అనుసరించే యీ సంధాను దినదినాభివృద్ధి చెందుతున్న తన ఆర్థిక రాజకీయశక్తీ, అజేయమైన అరుణసేనా, ప్రపంచ మంతటా శాంతి భద్రతలను గాఢంగా వాంఛించే కార్మిక కర్షక కష్టజీవుల అండా సంపూర్తిగా ఉంది. దురాక్రమణదారుల, నూతన యుద్ధప్రేరేపకుల ప్లానులన్నీ భగ్నంకాక తప్పదు. (హర్షధ్వనులు)

నూతన ప్రపంచయుద్ధ ప్రేరేపకులను బట్టబయలు చేస్తూ, వారి పాలసీ తుదకు ఏవిధంగా ముగుస్తుందో తెలియజేస్తూ కామ్రేడ్ స్టాలిన్ యీ క్రింది విధంగా తన అమూల్య అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు:

"నూతన యుద్ధ ప్రేరేపకులు అతినీచంగా పతనం చెందడమే చివరకు దీని ఫలితం. నూతన యుద్ధ ప్రేరేపకుల్లో ప్రధాన పాత్రధారి అయిన చర్చిల్ తన దేశప్రజలయొక్క విశ్వాసాన్ని యిదివరకే కోల్పోయాడు; ప్రపంచ ప్రజాతంత్రశక్తులన్నింటికీ దూరమయ్యాడు. ఇదితర యుద్ధోన్మాదులందరికీ అదే గతి పట్టబోతోంది. ఇటీవల ముగిసిన ప్రపంచ యుద్ధంయొక్క భయంకర దృశ్యాలు యిప్పటికీ సజీవముగా ప్రజల కండ్లకు కట్టినట్లు కనిపిస్తూనే ఉన్నాయి. శాంతినభిలషిస్తోన్న బ్రహ్మాండమైన నేటి సాంఘికశక్తుల నతిక్రమించడం చర్చిల్ శిష్యవర్గానికి ఒక కొరకరాని కొయ్యగా తయారయింది. కాబట్టి మరో నూతన యుద్ధాన్ని కల్పించడం వాళ్ళకు సాధ్యమయ్యే పనిగాదు."

పెట్టుబడిదారీవర్గాల ముఠాల చేతులలో ప్రజలు గ్రుడ్డిగా, నిస్సహాయంగా కీలుబొమ్మలుగా వినియోగపడేకాలం గడచిపోయింది. రెండు గోళాలలోవున్న శాంతికాముకులైన ప్రజలు శాంతి, ప్రజాస్వామికాల రక్షణకోసం, ప్రపంచ సంస్కృతి రక్షణకోసం ఇదివరకెన్నడూ లేనంత ధృఢంగా, సమీకరించబడుతున్నారు. మహత్తర సోవియట్ యూనియన్ నాయకత్వాన సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రపంచ సంఘటనయొక్క శక్తులు రోజురోజుకు అభివృద్ధిచెందుతూ స్పష్టమైనరూపాన్ని తీసుకొంటున్నాయి.

అమెరికా సామ్రాజ్యవాదులు అహంకారపూరితంగా యాటంబాంబులతో లక్షలాది ప్రజలను తుడిచిపెట్టివేయగలమనీ, దేశాల దేశాలను సర్వనాశనం చేయగలమని గొప్పలు

చెప్పుకుంటూ ప్రపంచాన్ని బెదిరించుతున్న యీ పరిస్థితులలో ప్రపంచ శాంతికి ప్రధాన సంరక్షకులుగా, పెట్టుబడిదారీ రాక్షసత్వాన్నుండి మానవ నాగరికతను కాపాడే దుర్గంగా ప్రజలంతా సోవియట్ యూనియన్ వైపుకు చూస్తున్నారు,

## శాంతిరక్షణకోసం ప్రజాసమీకరణ

శాంతికాముకులైన ప్రజలంతా ఇటీవల జరిగిన మిత్రరాజ్యసమితి జనరల్ అసెంబ్లీలో యుద్ధోన్మాదులకూ శాంతికాములకూ మధ్య జరిగిన ద్వంద్వ పోరాటాన్నుండి చక్కని పాఠాన్ని నేర్చుకొన్నారు. యాటంబాంబులను నిషేధించాలనీ, అయిదు అగ్రరాజ్యాలూ తమ ఆయుధ సంపత్తిలో మూడోవంతును వెనువెంటనే తగ్గించుకోవాలని సోవియట్ ప్రవేశపెట్టిన ప్రతిపాదనలను తిరస్కరించడం మూలంగా ఆంగ్లో అమెరికన్ సామ్రాజ్యవాదులు యావత్తు ప్రపంచ ప్రజల కళ్ళముందు శాంతికీ, అంతర్జాతీయ సహకారానికి బద్ధశత్రువులుగా బట్టబయలు అయ్యారు.

సోవియట్ యూనియన్ ప్రజలతోనూ, ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాల ప్రజలతోనూ శాంతి సంఘటనలో పెట్టుబడిదారీ దేశాలలోనూ, వలసదేశాలలోనూ వున్న ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు ఐక్యమవుతున్నారు.

యుద్ధానంతరం సామ్రాజ్యవాద వ్యతిరేకరంగం ప్రాచ్యదేశాలకు విస్తరించింది. ఇండొనీషియా, వియత్ నామ్, బర్మా, తదితర వలస దేశాలలోని ప్రజలు తమ స్వాతంత్ర్యంకోసం పోరాడుతున్నారు. కొరియా ప్రజలు సోవియట్ యూనియన్ యిచ్చిన నిస్వార్థమైన సహాయంతో సామ్రాజ్యవాదుల గులాములకూ, అభివృద్ధినిరోధక ముఠాకూ వ్యతిరేకంగా మహత్తరమైన విజయాన్ని సాధించి, తమ స్వతంత్ర ప్రజా రిపబ్లికను స్థాపించుకొన్నారు. ఈ రిపబ్లిక్ ను వెంటనే గుర్తించి బల్గేరియా ప్రభుత్వం తన హృదయపూర్వక అభివందనాలను అందజేసింది.

చైనాలోని లంచగొండి అభివృద్ధినిరోధక ముఠాకూ సామ్రాజ్యవాదులకూ వ్యతిరేకంగా తమ స్వాతంత్ర్యంకోసం ఏండ్లతరబడిగా తదేకదీక్షతో కొనసాగిస్తున్న చైనా ప్రజల వీరోచిత పోరాటం నేడున్న రెండు ప్రపంచకూటమిలకు అత్యంత ప్రధానమైంది.

అభివృద్ధి నిరోధక శక్తులకు వ్యతిరేకంగా చైనాలో జరుగుతున్న పోరాటంలో ప్రజాస్వామిక శక్తులదే పైచేయిగావుంది. అంతిమ విజయం వారిదేనని స్పష్టపడుతోంది. ఇది మనకు మహానందకరమైన విషయం, చైనాలో జరుగుతున్న యీ సంఘటన అమెరికా సామ్రాజ్యవాదుల ప్లానులను భగ్నపరచి తల్లక్రిందులు చేయడంలో ప్రధానశక్తిగా పనిచేస్తుంది.

ఈ విధంగా సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటన రోజురోజుకూ వృద్ధిఅవుతూ సంఘటిత పడుతోంది. ఈరోజు నది ఒక మహత్తరమైన శక్తి. అన్ని దేశాలలోని సామాన్య ప్రజానీకంలోనూ, సామ్రాజ్యవాద వ్యతిరేకశక్తులలోనూ ఉన్నత శ్రేణికి చెందినవారంతా నేడు కమ్యూనిస్టుపార్టీలలోనే ఉన్నారు. దురాక్రమణ దారులైన సామ్రాజ్యవాదుల యుద్ధ కుతంత్రాలను ఏవిధంగా స్తంభింపజేయాలో వారికి తెలుసు. ఆవిధంగా వారు ప్రపంచంలో శాశ్వత శాంతిని స్థాపించగలరు.

ప్రజాతంత్ర బల్గేరియా విదేశాంగ విధానాన్ని గురించి వివరంగా వివరిస్తూ కామ్రేడ్ డిమిట్రొవ్ యిలా చెప్పాడు:

మన విదేశాంగ విధానం – 1942 లో "పితృభూమి సంఘటనా" కార్యక్రమంలో వివరించబడిన విదేశాంగ విధానముయొక్క మూలసూత్రాలు బల్గేరియా ప్రజల జాతీయ ప్రయోజనాలకు గ్యారంటీనిస్తాయి. సోవియట్ యూనియన్ సన్నిహిత స్నేహ సంబంధాలను నెలకొల్పుతాయి. ఇరుగు పొరుగు దేశాలతో పరస్పర ఆదరాభిమానాలను చూరగొంటాయి.

శాశ్వత శాంతి, ఇతర దేశాల ప్రజలతో సహకారమూ మన రిపబ్లిక్‌కు అవసరం. అప్పుడే మనదేశంకూడా యితర అభివృద్ధికర దేశాలతో సరిసమానంగా అభివృద్ధిచెంది, ఆర్థికంగా బలపడుతుంది. ఉన్నత సంస్కృతిని అందుకోగలుగులుతుంది; ప్రజాస్వామిక సోషలిస్టురాజ్యాన్ని నిర్మించుకోగలుగుతుంది. ఇదే మనవిదేశాంగ విధానంయొక్క ఆశయం.

కాని మన జాతి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను కలిగి సమాన హక్కులను అనుభవించ గలిగితేనే ఇదంతా సాధ్యపడుతుందనే విషయం మన పార్టీకి తెలుసు. అందుకనే బల్గేరియా ప్రజలు తమ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను అతి జాగ్రత్తతో కాపాడుకుంటూ మన మిత్రరాజ్యాలతోనూ, శాంతి, స్వాతంత్ర్య కాంక్ష ప్రజలందరితోనూ సన్నిహిత సహకారం కోసం కృషిచేస్తూ, విదేశాల జోక్యానికి వ్యతిరేకంగా పోరాడుతున్నారు.

అంతర్జాతీయ పరిస్థితిని గురించీ వివరించే సందర్భంలో కామ్రేడ్ డిమిట్రొవ్ దక్షిణ స్లావ్ జాతుల సమ్మేళన సమస్యను గురించీ, మాసిడోనియన్ సమస్యను గురించి ప్రస్తావించాడు.

## దక్షిణ స్లావ్‌జాతుల ఫెడరేషన్

కామ్రేడ్ డిమిట్రొవ్ యిలా అన్నాడు: టిటోముఠా విద్రోహచర్య దక్షిణ స్లావ్ ఫెడరేషన్, మాసిడోనియన్ సమస్యల ఎడల ఆ ముఠా తీసుకొన్న వైఖరిలోకూడా బయటపడింది. ఈ ముఠా జాతీయత అనే ప్రమాదకరమైన రాస్తామీద నడుస్తోంది. సెర్బియన్ జాతీయ దురభిమానులు బాల్కన్ రాజ్యాలపై పెత్తనం సాధించి, మాసిడోనియాను సెర్బియాకు, యుగోస్లోవియాకు కలిపివేసుకోవాలనే వైఖరికి టిటోముఠా తాళంవేస్తోంది.

దేశాన్ని ఆర్థికంగానూ, సాంస్కృతికంగా అభివృద్ధిచేయవలసిన ఆవశ్యకతను గురించి కామ్రేడ్ డిమిట్రొవ్ ప్రస్తావించుతూ ఆ రంగంలో నెరవేర్చవలసిన తక్షణ కర్తవ్యాలను గురించి వివరించాడు.

కామ్రేడ్ డిమిట్రొవ్ యింకా యిలా అన్నాడు:

మొదటి పంచవర్ష ప్రణాళిక కాలంలో పరిశ్రమలలోనూ, వ్యవసాయంలోనూ సోషలిజానికి పునాది ఏర్పరచడం మన కర్తవ్యం. ఈ సమస్యా పరిష్కారం యీ ప్లానుపైన ఆధారపడి ఉంటుంది. ఈ ప్లానును ఆధారం చేసుకొనే ఆతరువాత అమలులోకి వచ్చే రెండు మూడు పంచవర్ష ప్రణాళికల కాలంలో సోషలిజానికి పునాదులుపడి సోషలిస్టు సమాజం సృష్టించబడుతుంది.

# పార్టీయే ప్రధాన నిర్ణాయక శక్తి

కామ్రేడ్ డిమిట్రావ్ తన రిపోర్టులోని తుదిభాగాన్ని పార్టీ నిర్మాణానికి వినియోగించాడు.

పార్టీ ఏవిధంగా వృద్ధిపొందిందో వివరంగా సమీక్షచేస్తూ కామ్రేడ్ డిమిట్రావ్ సభ్యుల యొక్క శక్తి సామర్థ్యాలను అభివృద్ధి చేయడానికి నిర్వర్తించవలసిన విధులను గురించి తెలియజేశాడు.

పార్టీ ఐదో కాంగ్రెసు జరిగేటప్పటికి 8053 ప్రాథమిక కమిటీలనూ 464000 సభ్యత్వాన్ని పార్టీ కలిగిఉందని కామ్రేడ్ డిమిట్రావ్ తెలియజేశాడు. దీనికి మనం సైన్యంలోనూ, లేబర్ ఫోర్ లోనూ, వున్న పార్టీ సభ్యులనూ, మాజీ సోషల్ డెమోక్రటిక్ పార్టీ నుండి - అది కమ్యూనిస్టుపార్టీలో కలిసిపోయిన తరువాత - మనలో చేరిన వారిని కలుపుకుంటే మొత్తం సభ్యత్వం 496000 వుంటుంది. అంటే దాదాపు 5 లక్షలన్నమాట.

70 లక్షల బల్గేరియా జనాభాలో 5 లక్షల పార్టీసభ్యులున్నారంటే అది ఒక బ్రహ్మాండమైన రాజకీయసైన్యం; పర్వతాలను సహితం కదిలించగల అజేయశక్తి అన్నమాట. అయితే పార్టీలోని ప్రతిఒక్క సభ్యుడూ చైతన్యంతో కూడిన విషయపరిజ్ఞానాన్ని కలిగిన కమ్యూనిస్టు అయి తన పార్టీయెడల, దేశంయెడల, మహత్తరమైన కమ్యూనిస్టు ఉద్యమంయెడల అత్యంత భక్తిశ్రద్ధకలిగి ఉండాలి. ప్రతిఒక్కరూ నిజమైన నాయకుడుగా పార్టీయేతర ప్రజానీకాన్ని సంఘటితపరచగల శక్తివంతుడుగా తయారుకావాలి. అప్పుడే పార్టీ అజేయశక్తి కాగలదు.

పార్టీచే సామాన్యంగా గుర్తించబడిన సిద్ధాంత - రాజకీయ నాయకత్వాన నడుపబడే పితృభూమి సంఘటన, ట్రేడ్ యూనియన్లు, బల్గేరియన్ వర్కర్స్ మెన్ యూనియన్, యూనియన్ ఆఫ్ పీపుల్స్ యూత్, వ్యవసాయకుల సంఘం, సహకారసంస్థలూ మొదలగు ఐక్య సాంఘిక - రాజకీయ సంస్థలు యింకా అనేకం ఉన్నాయి.

## సిద్ధాంత రాజకీయ నాయకత్వం

"మనదేశంలో రాజకీయ, సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక జీవితం యావత్తూ పూర్తిగా మన పార్టీ యొక్క సిద్ధాంత, రాజకీయ నాయకత్వంక్రింద అభివృద్ధి జెందడానికి కారణమిదే" నని కామ్రేడ్ డిమిట్రావ్ నొక్కిచెప్పాడు,

పార్టీయొక్క బలమూ, పలుకుబడీ దాని సభ్యత్వంయొక్క సంఖ్యవల్లనేగాక పార్టీ సభ్యులకుగల మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంత పరిజ్ఞానంపైనా, పార్టీ యెడల, సోషలిజం

యెడల వారికున్న భక్తిపైనా, ప్రజానీకంతో సన్నిహితసంబంధం వారు పెట్టుకోగల శక్తిపైనా, పార్టీ, ప్రభుత్వమూ నిర్ణయించిన జాతీయ కర్తవ్యాలను నెరవేర్చడానికి ప్రజలను సమీకరించి, వారికి నాయకత్వం వహించి, నడపగలశక్తిపైనా ఎక్కువగా ఆధారపడి ఉంటాయి.

ఈ దృక్పథంతో మనం చూస్తే పార్టీ అంతరంగిక పరిస్థితి అంతతృప్తికరంగా లేదు. కేంద్ర కమిటీ 16 వ విస్తృతసమావేశంలో స్పష్టపరిచినట్లు నిజానికి పార్టీలో సభ్యత్వానికి అభ్యర్థులుగా వుండదగినవారు పార్టీలో బహు కొద్దిమంది వున్నారు.

— పార్టీ సంస్థల నిత్యవ్యవహారాలలో అంతరంగిక పార్టీప్రజాస్వామికం చెప్పుకో దగినంతగా లేదు.

— వ్యక్తుల వివక్షతలేకుండా విమర్శ ఆత్మవిమర్శన పార్టీ జీవితంలో పైనుండి క్రింది వరకూ మూల సంచాలశక్తిగా యింకా పరిణితి చెందలేదు.

— పార్టీ సంస్థలలో ఆజ్ఞలను జారీచేసే విధానాలను మనం పూర్తిగా యింకా విడనాడలేదు. పార్టీయొక్క సమిష్టి ఆలోచనకూ అనుభవానికీ తగినంత విలువ యివ్వాలనే విషయాన్ని యింకా మనం తెలుసుకోలేదు. పార్టీ నాయకత్వం తన పనిని కామ్రేడ్స్ సంబంధాలపై ఆధారపడి యింకా నిర్వహించడంలేదు.

## కేడర్ల ఎన్నిక-కనిఖీ

అంతేకాదు. పార్టీశక్తివంతం కావడానికి, జయాన్ని సాధించడానికి రెండు అతిముఖ్యమైన విషయాలవసరమని లెనిన్ మహాశయుడు ఆదేశించిన మహత్తరభావాన్ని మనం మరచి పోవడంకద్దు. సరియైన కేడర్లను చూసి ఏరుకోవడం యిచ్చిన పనిని నెరవేర్చ టకి లేనిదీ ఎప్పటికప్పుడు తనిఖీచేసు కోడం. కేడర్లే మన అశేషవిజయాన్ని నిర్ణయిస్తాయి అని కామ్రేడ్ స్టాలిన్ పదేపదే చెప్పిన విషయాలపైకూడా మన కార్యాచరణలో అవసరమైనంత దృష్టిని కేంద్రీకరించడం లేదు.

అయితే ఒక దానిని ప్రత్యక్ష యదార్థంగా ఉదహరించవచ్చు. పెట్టుబడిదారీ విధానాన్ని నిర్మూలించి, మనదేశంలో సోషలిజాన్ని నిర్మించాలంటే ఆర్థికవిధానంలో ప్లానింగు సూత్రాలద్వారా పెట్టుబడిదారీ శక్తులపై రాజీలేని వర్గపోరాటాన్ని పార్టీ కొనసాగించాలనే విషయంలో పార్టీలో ఎవరికీ ఎలాంటి సందేహమూలేదు. దీని నందరూ జనరల్‌గా గుర్తించి, ఆచరణలో ఖచ్చితంగా అమలు జరుపుతున్నారు.

అయితే అంత మాత్రంచేత మన పార్టీలో పైనుంచి కిందివరకూ కార్యాచరణలో సంపూర్ణ ఐక్యత ఉన్నదని అనుకోడానికి వీలులేదు. దీనిని సాధించాలంటే మనం యింకా ఎక్కువ కష్టపడి పనిచేయవలసి ఉంటుంది. అనేక సార్లు కేంద్రకమిటీ నిర్ణయాలను నామమాత్రంగా మాత్రమే అంగీకరించి ఆచరణలో యింకొకవిధంగా తప్పుగా అమలు పరచడం జరగడం చూస్తున్నాం.

---

మన పార్టీలో యింకా "ఆ మేలియుసుగు నియంత" లున్నారు. వారు తమ పాత పుణ్యంపై - అది నిజం కావచ్చు లేక ఊహాజనితం కావచ్చు - ఆధారపడి పార్టీలో తము వున్న స్థానాన్ని దుర్వినియోగపరుస్తూ పార్టీ నిర్ణయాలను, ఆజ్ఞలకు బద్ధులుగాకుండా తమ యిష్టమొచ్చినట్లు ప్రవర్తించుతున్నారు.

అతి వాగుడుగాళ్లూ, (చాటర్ బాక్స్) వ్యక్తిగత అహంకారులూ, పెద్ద ఆశలు పెట్టు కొన్న వారూ, తమకు తెలియని విషయ

మంటూ లేదనీ తాము చేయనిదీ అంటూ లేదని నటించేవారూ, ఒక క్రమపద్ధతిలోనూ, గట్టిగానూ పనిని నిర్వహించే శక్తిసమర్థతలు, దీక్షాలేనివారూ, ప్రారంభించిన పనిని తుది దాకా ముగించే పట్టుదల లేనివారు - యింకా పార్టీలో ఉన్నారు. ఇలాంటివారే నేర్చుకోడానికి యిష్టపడరు. ఎలాంటి ఉపయోగకరమైన కార్యక్రమాన్నైనా యిట్టే ధ్వంసం చేయగల సమర్థులు.

ఇలాంటి పనికిరాని ప్రమాదకరమైన ధోరణికి వ్యతిరేకంగానూ, శత్రువులకు వ్యతిరేకంగానూ పార్టీ సిద్ధాంతరీత్యా తీవ్రమైన పోరాటాన్ని సాగించుతుంది. పార్టీలోని సభ్యుల తప్పులను బట్టబయలుచేయాలి. పొరపాటుచేసిన వారిని సరిదిద్దాలి. ఇంకా సరిదిద్దడానికి సహితం పనికిమాలిన వారిని ఎలాంటి సంకోచమూలేకుండా పార్టీనుండి బయటకునెట్టాలి. పార్టీలో పొరపాటున జేరినవారినీ, స్వార్థంతో పదవులకోసం చేరినవారిని వెంటనే బయటకు పంపి పార్టీని శుద్ధిపరచాలి. పైనుంచి క్రింది వరకూ ఆచరణలో బోల్షివిక్ ఐక్యతను నిర్మించేందుకు మన యావత్తుశక్తినీ వినియోగించి కృషిచేస్తాం. అదొక్కటే మన మహదాశయానికి విజయం చేకూరుస్తుంది.

## పార్టీని బలపరచుకోవాలి

పార్టీబలపడాలంటే తదేకదీక్షతో యీ క్రిందివాటిని మనం కొనసాగించితీరాలి :-

**ఒకటి :** ప్రమాదకరమైనవారినీ, పదవులకోసం ప్రాకులాడేవారినీ, పార్టీలో ఏదో విధంగా జేరినరకాన్నీ వెంటనే పార్టీ సంస్థలనుండి బయటకు నెట్టాలి.

**రెండు :** నూతనసభ్యులనూ, సభ్యత్వానికి అభ్యర్థులను పార్టీలోకి తీసుకొనేటప్పుడు పార్టీలో జేరి పనిచేయడానికి అభిలాషవున్న వారిలోనుండి వారివారి సాంఘిక అంతస్తును దృష్టిలో పెట్టుకొని, పార్టీనిబంధనలను ఖచ్చితంగా అనుసరిస్తూ కార్మికవర్గంనుండి వచ్చేవారు ఒక క్రమపద్ధతిని ఎక్కువగా ఉండేటట్లు చూసుకుంటూ జాగ్రత్తగా ఎన్నిక (సెలెక్టు) చేసుకోవలసి ఉంటుంది.

**మూడు :** పార్టీలో ఆజ్ఞలను జారీచేసే పద్ధతులను పూర్తిగా కట్టిపెట్టి, పార్టీ అంతరంగిక ప్రజాస్వామికాన్ని యింకా ఎక్కువగా అభివృద్ధిచేయాలి. పార్టీ కమిటీలలోనూ పార్టీ సంస్థలలోనూ సమిష్టిగా చర్చించి పార్టీ సమస్యలపై నిర్ణయాలు తీసుకోవాలి. పార్టీలో ప్రతిఒక్క సభ్యునికీ ఒక ఖచ్చితమైన పనిని అప్పజెప్పి, దానిని నెరవేర్చేటట్లు చూడాలి. పార్టీలో చక్కటి విమర్శననూ ఆత్మవిమర్శననూ ప్రోత్సహించాలి. పార్టీ కార్యక్రమాలలో పార్టీసభ్యులు ఎక్కువగా పాల్గొనేటట్లుచేయాలి. పార్టీ సంస్థలలో పార్టీ క్రమశిక్షణనూ, ఐక్యతను కట్టుదిట్టం చేయాలి.

**నాలుగు :** ఇదివరకటికంటే యింకా ఎక్కువ విశాల ప్రాతిపదికను ఆధారంచేసుకొని ఒక క్రమపద్ధతిపై సమిష్టిగానూ వ్యక్తిగతంగానూ పార్టీలోని ప్రతిఒక్కసభ్యుడూ, ప్రతి పార్టీఅభ్యర్థీ మార్కిస్టు - లెనినిస్టు సిద్ధాంత పరిజ్ఞానాన్ని అభివృద్ధిచేసుకొనేందుకు ఏర్పాట్లు జరగాలి.

**నేర్చుకోడానికీ, తనంతటతాను ఎడ్యుకేట్ అవడానికి, అభివృద్ధి చెందడానికి యిష్టపడని పార్టీసభ్యుడు మన పార్టీలో నిజమైన సభ్యుడుకాదు; కాజాలడుకూడా.**

ఆ తరువాత కామ్రేడ్ డిమిట్రావ్ పార్టీ నాయకత్వాన్ని నిర్మాణరీత్యా అభివృద్ధిచేయ వలసిన బాధ్యతలను గురించీ, యింకా పార్టీ కార్యక్రమంతో సంబంధించిన ఆర్థిక, రాజ్యాంగ మరి యితర రంగాలలోని కర్తవ్యా లనుగురించి ప్రస్తావించాడు. పార్టీ వర్గాలలో అక్కడక్కడ అగుపడే అజాగ్రత్తకూ, ఆత్మసంతృప్తితో కూడిన మందగొండితనానికి వ్యతిరేకంగా దృఢంగా పోరాడాలని ఆయన పార్టీ నాదేశించాడు.

రిపోర్టును ముగించుతూ కామ్రేడ్ డిమిట్రావ్ యిలా అన్నాడు: మన పార్టీ కమ్యూనిస్టు, వర్కర్లపార్టీల సమాచారబ్యూరో సమావేశంలో ఉత్సాహంగా పాల్గొన్నది. బోల్షివిక్ పార్టీ నాయకత్వాన, అభ్యుదయ మానవజాతికి మహానాయకుడైన జోసఫ్ స్టాలిన్ నాయకత్వాననడుస్తున్న ప్రపంచకమ్యూనిస్టు మహాకుటుంబానికి చెందివుండటాన్ని మనపార్టీ గర్వించుతోంది. (హర్షధ్వానాలు)

**నిజమైన లెనినిస్టుగా వుండకుండా ఎవరూ నిజమైన మార్క్సిస్టు కాజాలరు. స్టాలినిస్టు కాకుండా ఎవరూ నిజమైన లెనినిస్టు కాజాలరు; ఈ విషయం మనకు తెలుసు.**

కామ్రేడ్స్ నేను నా రిపోర్టును యీ క్రింది పార్టీ సందేశంతో ఇక ముగిస్తాను:

**అజేయమైన మార్క్స్ - ఎంగిల్స్ - లెనిన్ - స్టాలిన్‌ల నాయకత్వాన సోషలిజానికీ, కమ్యూనిజానికి పురోగమించండి! (సభ్యులవద్దనుండి విపరీతమైన హర్షధ్వానాలు)**

## కామ్రేడ్ డిమిట్రావ్ తుదిప్రసంగం

కామ్రేడ్ డిమిట్రావ్ పార్టీ కాంగ్రెసు ముగిసేముందు ఒక అత్యద్భుతమైన ప్రసంగం చేశాడు. పార్టీపాలసీకి సంబంధించిన ప్రధాన సమస్య లన్నింటిపైన కాంగ్రెసు ఏకీభావాన్ని ప్రదర్శించినదని తెలియజేశాడు. పార్టీ భవిష్యత్తు విజయానికి అదొక ముఖ్యమైన గ్యారంటీ అన్నాడు.

అయినప్పటికీ సరియైన రాజకీయ విధానం ఆచరణలో ఖచ్చితంగా అమలుజరగాలంటే సోషలిస్టు నిర్మాణంలో ఉత్సాహంగా పాల్గొనేందుకు నూతన శక్తులను ప్రవేశపెట్టవలసిన అవసరంవుంది. కష్టాలను అధిగమించశక్తిగల కేడర్లను నైపుణ్యంతో ఎన్నుకొని, సరియైన స్థానాలకు సరియైన వారిని ప్రమోట్ చేయ వలసి ఉంటుంది.

**తీసుకొన్న నిర్ణయాలు పూర్తిగా అమలుజరిగేటట్లు తనిఖీ చేయడం బోల్షివిక్ కంట్రోలూ, విమర్శన, ఆత్మవిమర్శనా, సమయానికి కదిలే నాయకత్వం, ప్రజానీకంతో అత్యంత సన్నిహిత సంబంధమూ - యివన్నీ పార్టీ నాయకత్వం యొక్క ఆయుధాగారంలో తప్పనిసరిగా వుండి తీరవలసిన సామగ్రి.**

ప్రజాస్వామిక ప్రజాతంత్ర సమస్యపై జరిగిన చర్చలో పాల్గొన్నవారిలో కొంత మంది కామ్రేడ్స్ ప్రజాస్వామిక ప్రజాతంత్రానికీ - సోవియట్ విధానానికి వున్న భేదంపై ప్రధానంగా నొక్కి చెప్పడం - లేక దాదాపు ఆధోరణిలో మాట్లాడటమో జరిగింది. కాని యీవిధంగా వాటి రెంటి

మధ్య భేదాన్ని గురించి యింత నొక్కి చెప్ప డం పొరపాటు నిర్ణయాలకూ, ప్రమాదకర మైన నిర్ణయాలకు దారితీస్తుందని కా|| మేడ్ డిమిట్రావ్ తెలియజేశాడు.

మార్క్సిజం - లెనినిజందృష్టి కోణంతో చూస్తే ప్రజాస్వామిక ప్రజాతంత్రమూ, సోవియట్ విధానమూ - రెండూ ఒకే శక్తికి గల రెండుస్వరూపాలుమాత్రమే. ఆ శక్తే కార్మికవర్గశక్తి. అది బస్తీలలోనూ పల్లెలలోనూ వున్న కష్టజీవులందరితోనూ కలసి వారికి నాయకత్వం వహించి నడిపించే కార్మికవర్గ శక్తి. ఇవి రెండూ - ప్రజాస్వామిక ప్రజాతంత్రము సోవియట్ విధానమూ - శ్రామిక వర్గ నియంతృత్వానికి రెండు రూపాలు.

## కార్మికవర్గ నియంతృత్వం తప్పనిసరిగా అవసరం

మనదేశంలో పెట్టుబడిదారీ విధానా న్నుండి సోషలిజానికి పరివర్తన చెందుతున్న ప్రత్యేక స్వరూపం మామూలుగా పెట్టుబడి దారీ విధానాన్నుండి సోషలిజానికి పరివర్తన కావడానికి కావలసిన సూత్రాలను, అది ఏరూపంలో వున్నప్పటికి మార్చలేవు.

పెట్టుబడిదారీ శక్తులకు వ్యతి రేకంగా పోరాడుతూ సోషలిస్టు ఆర్థిక విధానాన్ని సంఘటిత పరచే శ్రామిక వర్గ నియంతృత్వం లేకుండా సోష లిజానికి పురోగమించడం సాధ్యం కాదు.

బూర్జువా ప్రజాతంత్రం అంటే బూర్జువా నియంతృత్వ మన్నమాట. అత్యధిక సంఖ్యా కులుగావున్న కష్టజీవులపైన దోపిడిచేసే కొద్ది పాటి, మైనారిటీ అయిన బడా పెట్టుబడి దారుల నియంతృత్వం అది. ఇక ప్రజా స్వామిక ప్రజాతంత్రం అత్యధిక సంఖ్యాకు లైన కష్టజీవులతరపున, వారి ప్రయోజనాల కోసం శ్రామికవర్గ నియంతృత్వం నిర్వర్తించే బాధ్యతలను తాను నెరవేరుస్తుంది. ఆవిధంగా అది విశాలమైన పరిపూర్ణమైన ప్రజాతంత్రాన్ని సోషలిస్టు ప్రజాస్వామికాన్ని ప్రవేశపెడు తుంది.

ప్రజాస్వామిక ప్రజాతంత్ర ప్రభుత్వమూ సోవియట్ ప్రభుత్వమూ ఒకే ప్రధాన విష యానికి - కష్టజీవులందరితోనూ కలసి వారికి నాయకత్వం వహించి నడుపగలిగే కార్మిక వర్గంయొక్క ప్రభుత్వానికి - ప్రాతినిధ్యం వహిస్తాయనే విషయం సోవియట్ యూని యన్‌లో జరిగిన సోషలిస్టు నిర్మాణంయొక్క మహత్తరానుభవాన్ని పరిశీలించి అధ్యయనం చేయవలసిన అవసరాన్ని స్పష్టపరుస్తుంది.

ఈ అనుభవమే - మన పరిస్థితులకు అన్వ యింపజేసిన యీ అనుభవం ఒక్కటే-మన దేశంలోనూ యితర ప్రజాస్వామిక ప్రజా తంత్రరాజ్యాలలోనూ సోషలిజాన్ని నిర్మించ డానికి అన్నింటికంటే చక్కటి మార్గం.



# బూర్జువా జాతీయత

నానాటికీ బలవత్తరమవుతూన్న ప్రజాస్వామిక సోషలిస్టుశక్తులకు వ్యతిరేకంగా సామ్రాజ్యవాద అభివృద్ధినిరోధకవర్గం తాను సాగించే పోరాటంలో బూర్జువా జాతీయత అనే అరితేరిన విషపూరిత ఆయుధాన్ని తిరిగి ప్రయోగిస్తూఉంది. తన వర్గవిధానాన్ని తేలికగా అమలు జరుపుకోడానికీ, తన దురుద్దేశపూరిత ప్రణాళికల కొనసాగించుకోడానికీ, ఈ ఆయుధంద్వారా కార్మిక ప్రజాసామాన్యంయొక్క ఐక్యతను విచ్ఛిన్నంచేయాలనీ, వారిలో వర్గచైతన్యం కలగకుండా చూడాలనీ బూర్జువావర్గం ప్రయత్నిస్తూఉంది. బూర్జువా జాతీయత, కార్మికవర్గ అంతర్జాతీయత, ఈ రెండూ ఒకదానికొకటి పూర్తిగా విరుద్ధములు.

ఈ పరస్పర వ్యతిరేకములైన రెండు నినాదాలూ "పెట్టుబడిదారీ ప్రపంచంలోని రెండు పెద్దవర్గ శిబిరాలకు సంబంధించినవి. ఈ రెండు నినాదాలూ రెండు విధానాలను తెలియజేస్తున్నాయి." (లెనిన్)

"జాతీయత అనే పెడదారి నవలంబించడం తన 'జాతీయ' బూర్జువా వర్గ ప్రయత్నాలనే ప్రతిబింబించడం, పెట్టుబడిదారీ విధానాన్నే పునస్థాపించడం అవుతుంది." (స్టాలిన్)

లెనిన్ స్టాలిన్‌లు చెప్పిన ఈ సిద్ధాంతంపైనే విప్లవకరమైన మార్క్సిస్టు పార్టీలు ఆధారపడతాయి.

## సోవియట్ చూపిన ఆదర్శమార్గం

"ఒక్క బూర్జువా జాతీయతే అణచబడిన జాతులకు విముక్తిని చేకూరుస్తుంది." అనే పుక్కిటి గాధను మహత్తరమైన నవంబరు సోషలిస్టు విప్లవం చావుదెబ్బ కొట్టింది.

అనేక శతాబ్దాలనుంచి జాతీయ పీడనకు గురిఅయిన సోవియట్ జాతులన్నిటికి విముక్తి చేకూర్చడంద్వారా కార్మికవర్గ అంతర్జాతీయ పంథాపై అణచబడిన జాతులను విముక్తిచేయడం, అంతర్జాతీయతపై ఆధారపడి వివిధజాతులకు చెందిన కార్మిక కర్షకులమధ్య ఇచ్ఛాపూర్వకమైన సుహృద్భావ పూరిత సంబంధాలను ఏర్పరచడం ఆచరణ సాధ్యమే అని యావత్ప్రపంచ ప్రజలకు నవంబరు విప్లవంచాటి చెప్పింది.

సోవియట్ యూనియన్‌లో సోషలిజాన్ని సాధించడంవల్ల కలిగే ప్రయోజనాలు సమస్త దేశ ప్రజల విప్లవోద్యమ ప్రయోజనాలతో, పూర్తిగా మిళితం అవుతాయనీ, పెట్టుబడిదారీ దేశాల కార్మికులతో సోవియట్ కార్మికవర్గానికుండే అంతర్జాతీయ సంబధాలూ, సమస్త దేశాల్లోని కార్మికులతో కష్టజీవులతో సోవియట్ కార్మికులు సాధించే సుహృద్భావపూరితమైన ఐక్యత, సోషలిస్టు ప్రభుత్వంయొక్క శక్తిసామర్థ్యాలకు ఘనాదిరాళ్ళుగా ఉంటాయనీ బోల్షివిక్ ప్రభుత్వం మొదటినుంచీ గుర్తించింది

కార్మికవర్గ అంతర్జాతీయ పంథాపై శిక్షణ పొందిన ధీరోద్ధత సోవియట్ సైన్యం పోలండు, బల్గేరియా, రుమేనియా, జెకోస్లోవేకియా, హంగెరీ, ఫిన్లండు, యుగోస్లావియా దేశాల ప్రజలను జర్మనీ ఫాసిస్టు బానిసత్వంనుంచి విముక్తి చేయడంద్వారా తన అంతర్జాతీయ బాధ్యతను దిగ్విజయంగా నెరవేర్చింది. హిట్లరిజం యొక్క బానిసత్వంనుంచీ, ఆ బానిసత్వ భయంనుంచీ యావత్ ప్రపంచ ప్రజలను సోవియట్ సైన్యమే కాపాడింది.

బోల్షివిక్ పార్టీని స్థాపించినప్పటినుంచీ బూర్జువా జాతీయపోకడలకు వ్యతిరేకంగా లెనిన్ స్టాలిన్‌లు ఏకదీక్షతో పోరాడారు. పెద్దరాజ్య దురహంకార తత్వానికీ (గ్రేట్ పవర్ ఛావినిజం) స్థానిక జాతీయ తత్వానికీ వ్యతిరేకంగా పోరాటం సాగించడంలో సోవియట్ కమ్యూనిస్టుపార్టీ తగినంత అనుభవాన్ని గడించింది. ఈ అనుభవం సోదర కమ్యూనిస్టు పార్టీలన్నిటికీ ఆదర్శప్రాయంగా ఉంటుంది. సోవియట్ యూనియన్‌లో పెట్టుబడిదారీ విధానాన్ని పునస్థాపించడంకోసం అంతర్జాతీయ సామ్రాజ్యవాదుల బంట్లయిన బూర్జువా జాతీయవాదులు చేసినప్రయత్నాలను సోవియట్ కమ్యూనిస్టుపార్టీ ఎప్పటికప్పుడు బట్టబయలుచేసింది. వాటిని పూర్తిగా అణచివేసింది.

స్టాలిన్ యొక్క ప్రజ్ఞా, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీయొక్క నిశిత దృష్టీ, యుగోస్లావియాలోని టిటోముఠా జాతీయతను సకాలంలో బైటపెట్టాయి.

## టిటో చేసిన ద్రోహం

ప్రజాస్వామిక ప్రజాతంత్ర దేశాలు తమ స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను బలపరచుకోడంలో యుగోస్లావియా కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీకి సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ వ్రాసిన ఉత్తరాలూ, యుగోస్లావియా కమ్యూనిస్టుపార్టీ పరిస్థితులనుగురించి ఇన్ఫర్మేషన్ బ్యూరో చేసిన తీర్మానమూ చరిత్రాత్మక ప్రాముఖ్యత వహిస్తున్నాయి.

ఇరుగు పొరుగు ప్రజాస్వామిక దేశాల ప్రజలపై ద్వేషాన్ని పురికొల్పడమే టిటో ముఠా అవలంబించిన జాతీయవిధానంయొక్క ఉద్దేశం. సామ్రాజ్యవాదులకు సాంప్రదాయ సిద్ధమైన జాతి దురహంకారాన్ని రెచ్చగొట్టే పద్ధతులనే టిటోముఠాకూడా చేపట్టింది. ఈ పద్ధతులద్వారానే సామ్రాజ్యవాదులు బాల్కన్‌ద్వీపకల్పాన్ని యూరప్ మందు గిడ్డంగిగా తయారుచేసి బాల్కన్ ప్రజల రక్తాన్ని బలిగొన్నారు. ఇలాంటి జాతి దురహంకార పద్ధతులనే సామ్రాజ్యవాదులనుంచి టిటోముఠా అరువు తెచ్చుకుంటుంది అంటే ఆముఠా ఎంతటి నీచస్థితికి దిగజారిపోయిందో స్పష్టంగా బోధపడుతుంది.

ఆల్బేనియాలాంటి ప్రజాస్వామిక ప్రజాతంత్ర దేశంలోనూ, తదితర సోదర ప్రజాస్వామిక ప్రజాతంత్ర దేశాల్లోనూ, ట్రాట్‌స్కీయిజాన్నీ,

సైన్యరిజాన్నీ, గూఢచారి శాఖనూ నిర్మించడమనే పనిని టిటోముఠా లాంటి ద్రోహులుమాత్రమే చేయగలుగుతారు. నేడు వాళ్ళు చేస్తూన్న పనికూడా అదే.

ప్రజాస్వామిక ప్రజాతంత్ర దేశాలు ఇతోధికంగా అభివృద్ధిచెంది సర్వసమృద్ధంగాఉండాలన్నా, అవి తమ జాతీయ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను సుస్థిరంగా, సురక్షితంగా కాపాడుకోవాలన్నా, కమ్యూనిస్టు పార్టీలమధ్య అభేద్యమైన ఐక్యత ఏర్పడడం, ప్రజాస్వామిక ప్రజాతంత్రదేశాలు సుహృద్భావంతోపరస్పరం సహకరించుకోడం, సోవియట్ యూనియన్‌తో స్నేహంగా ఉండడం ప్రస్తుత అంతర్జాతీయ పరిస్థితుల్లో చాలా అవసరం అని విస్పష్టంగా తెలుసుకోవలసి ఉంటుంది.

సోవియట్ యూనియన్‌తో స్నేహసంబంధాలను తెంచుకోడానికి చేసే ప్రయత్నాల్లో బూర్జువా జాతీయత ప్రస్ఫుటమవుతూ ఉంది. దేశంలో అభివృద్ధినిరోధక విదేశ సామ్రాజ్యవాదుల పలుకుబడినీ, వర్గశత్రువు పలుకుబడినీ బూర్జువా జాతీయత ప్రతిబింబిస్తుంది. శ్రామిక వర్గ అంతర్జాతీయతపట్ల చూపించే శ్రద్ధాసక్తులకూ, జాతిసమస్యపై లెనిన్ స్టాలిన్‌ల సిద్ధాంతాన్ని అమలు జరిపే అభిలాషకూ, (సోషలిస్టువిప్లవం అనే ప్రధాన సమస్యలో లెనిన్ స్టాలిన్‌ల సిద్ధాంతముకూడా ఒక అవిచ్ఛిన్న భాగమే.) సోవియట్ యూనియన్ పట్ల ప్రదర్శించే వైఖరియే నికాక గీటురాయిగా — పరీక్షగా ఉంటుంది.

ఆయాదేశాల బూర్జువా జాతీయ పద్ధతులపై ఆయాదేశాల్లోని జాతివిశేషతలయొక్క, వివిధ రాజకీయపరిస్థితులయొక్క ప్రభావం సహజంగా పడుతూనే ఉంటుంది. అయినప్పటికీ బూర్జువా జాతీయతయొక్క అభివృద్ధినిరోధకవర్గతత్వం మాత్రం ప్రతివిషయంలోనూ ప్రధానంగా గోచరిస్తూనే ఉంటుంది. పెట్టుబడిదారీ ప్రపంచంయొక్క విధానమూ, సిద్ధాంతమూ ప్రతిచోటా వెల్లడి అవుతూనే ఉంటుంది.

అభివృద్ధినిరోధక బూర్జువా జాతీయ పద్ధతులుకూడా వివిధరకాలుగా ఉంటాయి. సోవియట్‌కు వ్యతిరేకంగా చేసే జాతీయ ప్రచారమూ, ప్రజల్లో అవిశ్వాసబీజాల నాటడానికి పుట్టించే పుకార్లూ, కేథలిక్ అభివృద్ధినిరోధక తత్వాన్నీ, పల్లె ప్రాంతాల్లో ధనిక రైతువర్గాన్నీ ఉపయోగించుకోడం ఇవన్నీ అందులోచేరినవే.

పార్టీలో ఉన్న మితవాద జాతీయ పోకడనూ, ఆపోకడపట్ల పార్టీ అవలంబించిన సామరస్య వైఖరినీ పోలిష్ కమ్యూనిస్టుపార్టీ తన ఆత్మవిమర్శనలో నిశితంగా విమర్శించుకుంది. ఈ బూర్జువా జాతీయ పోకడలకు వ్యతిరేకంగా తీవ్రమైన పోరాటం సాగించడానికి పోలండు పార్టీ తన శాఖలన్నిటినీ సమీకరించింది.

ఈ పోరాటఫలితంగా పార్టీ సభ్యులు సిద్ధాంతరీత్యా, నిర్మాణరీత్యాకూడా తగినంతగా గట్టిపడుతున్నారు. త్వరలోనే జరగబోయే పోలండు కమ్యూనిస్టుపార్టీ, సోషలిస్టు పార్టీల సమ్మేళనం (ఇప్పుడు ఈ రెండు పార్టీల సమ్మేళనం జరిగిందికూడా — సంపాదకుడు.) పోలండు కార్మికవర్గోద్యమంలో ఉన్న

జాతీయతత్వానికి ఒక చావుదెబ్బ. ఇది శ్రామిక వర్గ అంతర్జాతీయ సూత్రాలయొక్క విజయాన్ని సూచిస్తుంది.

## అతి జాగరూకత

యుగోస్లావియా కమ్యూనిస్టుపార్టీ పరిస్థితిపై ఇన్‌ఫర్మేషన్ బ్యూరో చేసిన తీర్మానాన్ని అధ్యయనంచేస్తూ ప్రజాస్వామిక ప్రజాతంత్రదేశాల కమ్యూనిస్టుపార్టీలు జాతీయ అభివృద్ధినిరోధకవర్గం సాగించే కుట్రలకు వ్యతిరేకంగా తగినంత జాగ్రత్త తీసుకుంటున్నాయి. ఆర్థికంగా విచ్ఛిన్నచర్యలు కొనసాగిస్తూ ఈ ప్రజాతంత్రదేశాల నూతన విధానాన్ని సమూలంగా పెకలించజూచే అభివృద్ధి నిరోధకశక్తులు ఆటలు కట్టిస్తున్నాయి.

రుమేనియాలో కుట్రలు పన్నిన గూఢచారులపై ఇటీవల జరిపిన విచారణను బట్టి చూస్తే ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదుల చెప్పుచేతల్లో నడుచుకుంటూ బూర్జువా-జాతీయ అభివృద్ధినిరోధక వర్గం ఎంతటి ద్రోహానికి పాల్పడుతుందో స్పష్టంగా బోధపడుతుంది.

ఈ బూర్జువా జాతీయతే హంగేరీలో మరోవిశిష్టరూపాన్ని ధరించింది. విదేశాంగ విధానంలో 'తటస్థత' 'మూడోమార్గం' కోసం వెదకడంలో ఇది ప్రస్ఫుటమవుతూంది.

కాబట్టి ఆంతరంగిక అభివృద్ధి నిరోధక శక్తులు సాగించే కుట్రలకు వ్యతిరేకంగా కమ్యూనిస్టుపార్టీలూ, అసంఖ్యాక ప్రజలూ ఇంకా ఎక్కువ జాగరూకత వహించవలసి ఉంటుంది.

చారిత్రకంగా చాలా స్వల్పకాలవ్యవధిలోనే ప్రజాస్వామిక ప్రజాతంత్ర దేశాల్లో వివిధజాతులకు చెందిన కార్మిక ప్రజాసామాన్యంలో సుహృద్భావపూరిత అంతర్జాతీయైక్యతా సంబంధాలు నెలకొని గట్టిపడ్డాయి. అనేకసంవత్సరాల తరబడిగా వివిధజాతుల మధ్య పరస్పర కలహాలను బుద్ధిపూర్వకంగా రెచ్చగొట్టే ద్రోహపూరిత బూర్జువా ఎత్తుగడలను ఇంతటితో చిత్తుచేయడం జరిగింది.

## ప్రధాన కర్తవ్యాలు

జాతి ద్వేషాలకు వ్యతిరేకంగా పోరాటం సాగించడం, జాతి సమస్యలనే ప్రధానంగా అంటిపెట్టుకొని వ్రేలాడే పెట్టుబడిదారీ అవశేషాలను తుడిచిపెట్టడం, సిద్ధాంత స్థాయిని పెంచడం, జాతుల సమస్యపై మార్క్సిజం - లెనినిజంనుంచి పెడదారిబట్టే పోకడలకు వ్యతిరేకంగా పోరాటం సాగించి గడించిన అనుభవానికి పెన్నిధియైన సోవియట్ కమ్యూనిస్టుపార్టీ చరిత్రను (బోల్షివిక్) అధ్యయనం చెయ్యడం కమ్యూనిస్టుపార్టీ సభ్యుల అత్యంత ప్రధాన కర్తవ్యాలు.

పాతకాలం నాటి జాతిద్వేషాలనూ, ఒకే దేశంలో వివిధ జాతుల మధ్య పరస్పరం ఉండే వైమనస్యాలనూ సమూలంగా నిర్మూలించి వేయడానికి జెకోస్లోవేకియా, పోలండు, రుమేనియా, తదితరదేశాలూ ఇంకా చాలా కృషిచేయవలసిఉంది. ఈ బూర్జువా, జాతీయ సంబంధాలు ఇంకా ఆ దేశాల్లో అక్కడక్కడ తలఎత్తుతూనే ఉన్నాయి.

జాతుల సమస్యను పరిష్కరించడంలో కమ్యూనిస్టుపార్టీలు మార్క్సిస్టు - లెనినిస్టు సూత్రాలకు ఖచ్చితంగా, హృదయ పూర్వ

కంగా కట్టుబడి ఉండకపోతే మళ్లీ బూర్జువా, జాతీయ సంబంధాలు జీవంపోసుకొని విజృంభిస్తాయి. కాబట్టి పార్టీ సభ్యుల్లోనూ, ప్రజల్లోనూ శ్రామికవర్గ అంతర్జాతీయ భావాలను అభివృద్ధిపరిచే కృషిని తృణీకరించడం క్షంతవ్యంకాదు.

సోవియట్ యూనియన్ యొక్క చారిత్రకానుభవాన్ని ఆధారంగా తీసుకొని వివిధ జాతులమధ్య లెనిన్-స్టాలిన్ సుహృద్భావం సాధించిన చారిత్రాత్మక విజయాలను పార్టీ కమిటీలన్నీ ప్రజల్లో విరివిగా ప్రచారము చేయవలసి ఉంటుంది. నూతన ప్రజాస్వామిక దేశాల్లో ఉన్న వివిధ జాతులమధ్య పరస్పర సంబంధాలను దృఢతరం చేయడానికీ, అంతర్జాతీయ భావాల నిత్యాధికంగా అభివృద్ధిపరచి వాటిని బలవత్తరం చేయడానికీ పాటు పడవలసి ఉంటుంది.

కమ్యూనిస్టు పార్టీలు జాతులపట్ల అవలంబించే తమ విధానాన్ని జయప్రదంగా కొనసాగించాలంటే పైజెప్పిన కర్తవ్యాలను ముందు పూర్తిచేయడం అత్యవసరం.

'శ్రామిక్ ఫారం' సంపాదకీయం 1-12-48

"కమ్యూనిజం అన్నిదేశాల్లో రోజురోజుకూ అభివృద్ధి చెందుతూఉంది. శాకలు తీరి ఉక్కులాగా గట్టిపడుతూఉంది దానివేళ్ళు ప్రజల్లో చాలా లోతుగా చొచ్చుకుపొయ్యాయి. వాటిని పెకలించడం ఇక ఎవరితరంగాదు. నిర్బంధవిధానమూ, హింసాచర్యలూ కమ్యూనిజాన్ని బలహీన పరచలేవు. నిర్వీర్యం చేయలేవు. పైపెచ్చు దాన్ని ఇంకా బలవత్తరం చేస్తాయి."

—లెనిన్ (1920)

# వార్తలూ - విశేషాలు

"డెయిలీవర్కర్" సంపాదకుడు

##  కామ్రేడ్ విలియం రస్ట్ మరణం 

కామ్రేడ్ విలియమ్‌రస్ట్ మొన్న ఫిబ్రవరి 3వ తేదీన మరణించాడు. ఈయన "డైలీ వర్కర్" ప్రధాన సంపాదకుడు. బ్రిటిష్ కమ్యూనిస్టుపార్టీ పొలిటి బ్యూరో సభ్యుడు.

బ్రిటిష్ కమ్యూనిస్టుపార్టీ ప్రముఖ నాయకులలో కామ్రేడ్ విలియమ్‌రస్టు ఒకరు ఆయన చనిపోయేనాటికి ఆయన వయస్సు 45 సంవత్సరాలు మాత్రమే. ఆయన చిన్ననాటినుండీ అంటే 15 యేండ్లవయస్సునుండీ కార్మికోద్యమంలో చురుకుగా పాల్గొంటూ వుండేవాడు. బ్రిటిష్ కమ్యూనిస్టు పార్టీ 1921లో స్థాపించబడినప్పుడు స్థాపకులలో ఆయనొకరు. అప్పుడే యువక కమ్యూనిస్టు లీగుకు ప్రధాన కార్యదర్శిలాంటి ముఖ్యపదవిని ఆయన కొప్పజెప్పారు.

కార్మికోద్యమంలో ప్రముఖ పాత్రను నిర్వహించాడు. అనేక సమ్మెపోరాటాలలో పాల్గొన్నాడు. కార్మికుల హక్కులకోసం నిర్భయంగా పోరాడే సందర్భంలో ఆయన రెండుసార్లు కారాగారశిక్ష సహితం అనుభవించవలసివచ్చింది.

హిట్లరు ముసోలినీ సాయంతో ఫాసిస్టులు స్పెయిన్ రిపబ్లిక్‌పై అమానుషమైన దాడి చేసినప్పుడు అంతర్జాతీయ బ్రిగేడ్‌లో బ్రిటన్ తరఫున విలియం రస్టు స్పెయినుకువెళ్ళి ప్రజల తరఫున వీరోచితంగా పోరాడాడు.

విలియమ్‌రస్టు బ్రిటన్ తరఫున అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ కార్యకలాపాలలోకూడా చాలకాలం పాల్గొన్నాడు. అంతర్జాతీయ కార్మికోద్యమ నిర్మాణంలోకూడా కామ్రేడ్ రస్టు ముఖ్యపాత్రను నిర్వహించాడు.

'డైలీవర్కర్' ప్రధాన సంపాదకుడుగా విలియమ్‌రస్టు చాలసంవత్సరాలు అమూల్యమైన సేవచేశాడు.

గత పదిసంవత్సరాల కాలంలో అతని సారధ్యంక్రిందనే డైలీవర్కర్ గుత్తపెట్టుబడిదారుల పత్రికలను ఎప్పటికప్పుడు ఎదుర్కొంటూ బ్రిటన్‌లోని కార్మికవర్గానికీ, కష్టజీవులకూ అండగా నిలబడి వారి విశ్వాసాన్ని చూరగొన్నది. డైలీవర్కర్‌ను స్థాపించి యిప్పటికి 18 ఏండ్లు అయింది.

కామ్రేడ్ విలియమ్ రస్టు సంపాదకత్వాన "డైలీ వర్కర్" సామ్రాజ్యవాదుల లంచగొండి పత్రికల విషపూరిత ప్రచారాన్ని ఎదుర్కొంటూ వలసదేశాల స్వాతంత్ర్యోద్యమాన్ని, భారత స్వాతంత్ర్యపోరాటాన్ని బలపరుస్తూ వచ్చింది.

కామ్రేడ్ విలియమ్ రస్ట్ నిరంతరకృషి ఫలితంగానే గత సంవత్సరం 'డైలీ వర్కర్' పెద్దసైజు దిన పత్రిక కాగలిగింది.

కామ్రేడ్ రస్ట్ మరణంమూలంగా బ్రిటిషు కార్మికోద్యమమేగాక యావత్తు అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం-సోషలిజంకోసం తాను సాగించే పోరాటంలో ఒక ముఖ్యమైన కామ్రేడ్‌ను, ఒక ఉత్తమ పత్రికా రచయితనూ కోల్పోయింది.

* * *

# ద్వితీయ అంతర్జాతీయ మహిళా మహాసభ

బుడాపెస్టునగరంలో డిసెంబరులో జరిగిన రెండవ అంతర్జాతీయ మహిళా మహాసభకు 36 దేశాలనుంచి 50 జాతులకు ప్రాతినిధ్యం వహిస్తోన్న 385 మంది ప్రతినిధులు హాజరయ్యారు. ఈమహాసభ జరగకుండా అమెరికా సామ్రాజ్యవాదులూ, వాళ్ళ ఏజెంట్లూ అనేక విఘ్నాలు కలిగించారు. కాని వాళ్ళ ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి.

శాంతి, అభ్యుదయాలకోసం, స్త్రీలయొక్క రాజకీయార్థిక హక్కులకోసం, శిశు సంరక్షణకోసం సాగించిన నిరంతరకృషిఫలితంగా ఈ అంతర్జాతీయ ప్రజాస్వామిక మహిళా ఫెడరేషన్ యావత్ ప్రపంచంలో ప్రధాన మహిళాసంస్థగా- మహిళాలోకంచే గుర్తించబడింది.

ఈ ఫెడరేషన్‌లో మొత్తం 56 దేశాల్లో 8 కోట్ల సభ్యత్వంఉంది.

ప్రపంచ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్, ప్రపంచ యువజన ఫెడరేషన్, ప్రపంచ మహిళా ఫెడరేషన్‌ల కార్యకలాపాలను సమన్వయించవలసినఆవశ్యకతకు ఈ మహాసభలో ప్రాముఖ్యత ఇవ్వబడింది.

ఈ మహిళా ఫెడరేషన్‌కు పోటీగా మరో ఫెడరేషన్‌ను ఏర్పాటుచేయాలని అభివృద్ధినిరోధకులు చేసిన ప్రయత్నాలేవిధంగా విఫలమయ్యాయో తెలియజేయబడింది.

శాంతి, అభ్యుదయాలకోసం సోవియట్ యూనియన్ సాగిస్తోన్న పోరాటానికి తన సహకారం పూర్తిగా ఉంటుందని ఈ మహాసభ ప్రకటించింది.

సుప్రసిద్ధ విజ్ఞానశాస్త్రవేత్త అయిన యూజినీ కాటన్ నే మళ్ళీ అధ్యక్షురాలుగానూ, ఇబారూరీ (స్పెయిన్) పోపోవా (రష్యా), వెల్టుఫిష్ (అమెరికా), సైఛాంగ్ (చైనా), లను ఉపాధ్యక్షులుగానూ ఎన్నుకున్నారు.

* * *

# 10,000,000 బుషెల్స్

## బంగాళాదుంప మట్టిపాలు

అమెరికాలో బంగాళాదుంపల పంట ఈ సంవత్సరం బాగా పండినందువల్ల కెనడానుంచి అమెరికాకు బంగాళాదుంపల దిగుమతి జరగకుండా అమెరికా ప్రభుత్వం అరికట్టింది. అందువల్ల బంగాళాదుంపల ధర పడిపోకుండా నిలబెట్టేందుకుగాను కెనడా పెట్టుబడిదారీ ప్రభుత్వం ఒకకోటి బంగాళాదుంపలనుకొని బుద్ధిపూర్వకంగా వాటిని మట్టిపాలు చేసివేస్తోంది.

అనేకమంది ప్రజలు ఒకవైపు తిండిలేక మాడిపోతూఉంటే, గుజరాతు లాంటి ప్రాంతాల్లో ఒకవైపు ప్రజలు 'అన్నమో రామచంద్రా' అని అలమటిస్తూఉంటే, మరోవైపు పెట్టుబడిదారీ దేశాలు ఈవిధంగా ఆహారపదార్థాలను బుద్ధిపూర్వకంగా నాశనం చేసివేస్తున్నాయి. పెట్టుబడిదారీ విధానం ఫలితంగా ప్రజలెట్టి అనర్థాలకు గురిఅవుతున్నారో ఇంతకంటే ఇంకా వేరే నిదర్శనం ఎందుకు?('కొమిన్ ఫారం' (10-12-48)నుంచి)

# దక్షిణ చైనాలో విముక్తి సైన్యం

చైనా ప్రజావిముక్తిసైన్యంయొక్క ప్రధాన కార్యాలయం ఉగాదివాడు జారీచేసిన ఉత్తరువు ప్రకారం దక్షిణచైనాలో కూడా విముక్తి సైన్యాలు నిర్మించబడ్డాయి. లిన్-పింగ్, లి-యంగ్-పింగ్, ఛాంగ్ టిన్ అనే వారు వీటికి సైన్యాధిపతులుగా నియమించబడ్డారు. దక్షిణ చైనానుకూడా ఏవిధంగా అప్పుడే విప్లవోద్యమ ప్రవాహం ముంచికేస్తూందో ఈ ఘటన తెలియజేస్తుంది.

—చైనాడైజెస్టు 25-1-49 నుంచి

* * *

# ఢిల్లీలో జరిగిన రహస్య సమావేశం

ఇండోనేషియాపై విశ్వాసఘాతుకంగా డచ్ సైన్యం దెబ్బగొట్టిన తర్వాత నెలరోజులకు ఢిల్లీలో 17 రాజ్యాల సమావేశం జరిగింది. పండితనెహ్రూ ఈ సమావేశానికి ప్రధాన కారకుడు. ఇండోనీషియా పరిస్థితిని గురించి చర్చించడానికే ఈ సమావేశం ఉద్దేశించ బడింది అని అధికారప్రకటన. కాని సమావేశం జరిగిన నాలుగురోజుల్లో ఇండోనీషియాపై కొద్దిసమయంమాత్రమే వినియోగించబడింది. మిగతామ సయమంతా ఇండోనీషియాకు సంబంధించని తదితర విషయాలపై రహస్య సమావేశాలు జరుపుకోడానికి ఉపయోగించుకున్నారు. ఇండోనీషియాపై భద్రతాసమితిలో అమెరికా ప్రతినిధి చేసిన తీర్మానంకంటె ఈ సమావేశం చేసిన తీర్మానంలో చెప్పకోతగిన విశేషం ఏమీలేదు.

ఢిల్లీసమావేశం ఆసియా 'సహకారం'పై మరోతీర్మానం చేసింది. ఈ తీర్మానంలోని భాష అస్పష్టంగా ఉన్నా (ఈ అస్పష్టత కూడా బుద్ధిపూర్వకంగా ప్రవేశపెట్టినదే) దాని ఉద్దేశంమాత్రం యునైటెడ్ నేషన్సుకు అంగీకారమైన పద్ధతిలో ఈ రాజ్యాలన్నీ కలిసి పరిస్థితుల కనుగుణంగా కావలసిన యంత్రాన్ని తయారుచేసుకోడం అని అందులో స్పష్టంగానేఉంది.

"ఇండియా ఆధ్వర్యాన ఆసియా కూటమిని నిర్మించడానికి చేసిన ప్రథమప్రయత్నం" అని ఢిల్లీ సమావేశాన్ని గురించి ఆస్ట్రేలియా పత్రికలు వ్రాశాయి.

"ఆసియా రాజ్యాల సంఘటన ఏర్పడింది. చైనాలో వచ్చిన మార్పులవల్ల తారుమారైన పరిస్థితులను సరిచేయడానికి ఈ సమావేశం తోడ్పడింది." అని రోములో (ఫిలిప్పైయిన్) ప్రకటించాడు.

చైనాలో కమ్యూనిస్టు విజయంవల్ల అమెరికా సామ్రాజ్యవాదుల ప్లానులు తల్లక్రిందయ్యాయి. చైనామీద సామ్రాజ్యవాదులు పెట్టుకున్న ఆశలు అడుగంటడంతో వాళ్ళ దృష్టి ఇప్పుడు ఇండియాపై ప్రసరించింది. చైనా ఖాళీచేసిన స్థానాన్ని ఇండియా పూర్తి చేయవలసి ఉంటుంది అని రోములో ప్రకటించాడు. ఆసియాలో విజృంభిస్తోన్న జాతీయ విముక్తిపోరాటాల నరికట్టడానికి 'అసాధారణమైన రాజకీయ సైనికచర్యలు' జరపవలసి ఉంటుందని ఆంగ్లో అమెరికా సామ్రాజ్యవాదులు బహిరంగంగానే ప్రకటిస్తున్నారు. ప్రయత్నిస్తున్నారు. ఆ ప్రయత్నాల్లో ఒక భాగమే ఈ ఢిల్లీసమావేశం.

(న్యూటైమ్సు 2-2-49 నుంచి)

# గ్రంథ సమీక్ష





## ఏమి చెయ్యాలి?

రచన: లెనిన్

అనువాదం:

కంభంపాటి సత్యనారాయణ (సీనియర్)

వెల: 1-12-0

ప్రాప్తిస్థానం:

లీలా బుక్‌డిపో, విజయవాడ.

"బోల్షివిక్‌పార్టీ సిద్ధాంత పరిజ్ఞానానికి ఇది పునాది వంటిది." అని ఈ గ్రంథాన్ని గురించి సోవియట్ కమ్యూనిస్టుపార్టీ చరిత్రలో పేర్కొనబడింది.

మార్క్సిజాన్ని తిరిగి 'మరమ్మతు' చేసి 'ఆధునికం' చేయాలనే సాకుతో బూర్జువా మంత్రివర్గాల్లో చేరడాన్ని 'సోషలిస్టులు' సమర్థిస్తూ ఉన్నరోజుల్లో 1902 లో లెనిన్ ఈ గ్రంథాన్ని రచించాడు.

ఈనాడున్న బాధలన్నీ పోవాలంటే "జయప్రకాశ్ - నెహ్రూ - కూటమి" ఒక్కటే సర్వరోగనివారిణి అని మన దేశంలో కొందరు కొత్తసిద్ధాంతాలు లేవదీస్తున్నారు. ఎన్నికల సమయంలో వోట్లు వేయడం (బ్యాలట్ బాక్సు) ద్వారానే సోషలిజంవస్తుంది అనే తమవిశ్వాసాన్ని ఇండియా సోషలిస్టులు ఏమాత్రం మరుగుపరచకుండా బహిరంగంగానే ప్రకటిస్తూఉన్న ఈరోజుల్లో ఈగ్రంథం చాలా ప్రత్యేక ప్రాముఖ్యత వహిస్తూఉంది.

రష్యాలోకూడా 'ఆర్థిక వాదులు' అనబడే ఒక గ్రూపువారు ఇలాంటి సిద్ధాంతాలనే లేవదీశారు. రాజకీయాలతో కార్మికులెట్టి సంబంధాలూ ఉంచుకోవలసిన అవసరం లేదనీ, పెట్టుబడిదారులకు వ్యతిరేకంగా జరిగే ఆర్థిక పోరాటాలమీద మాత్రమే కార్మికులు తమ దృష్టిని కేంద్రీకరించాలనీ, (ఇలాంటి ధర్మపన్నాలు మనదేశంలోకూడా తరుచుగా వింటూనే ఉన్నాం.) వారు వాదిస్తూఉండేవారు. కార్మికోద్యమంలో పెట్టుబడిదారీ రాజకీయాలను ప్రవేశపెట్టడానికి ఈ 'సిద్ధాంతం' ఒక ముసుగు మాత్రమే అని లెనిన్ వారి వాదాన్ని దుయ్యబడుతూ ఇలా అన్నాడు:

"రెండే రెండు సిద్ధాంతాలు. ఒకటి బూర్జువాసిద్ధాంతం. రెండవది సోషలిస్టు సిద్ధాంతం. ఈ రెంటికి మధ్యమార్గమంటూ లేనేలేదు. ఈ రెంటిలోనే ఏదో ఒకటి స్వీకరించవలసి ఉంటుంది."

"మధ్యమార్గం" "తటస్థత", అటు ఆపక్షానికీ చెందం, ఇటు ఈపక్షానికీ చెందం' 'అటు క్యాపిటలిస్టులతోనూ ఉండం, ఇటు 'కమ్యూనిస్టులతోనూ ఉండం,' 'అటు సామ్రాజ్యవాద అమెరికాతోనూ సహకరించం', 'ఇటు సోషలిస్టు సోవియట్ యూనియన్‌తోనూ సహకరించం' అనే మాటలను నేడు మనదేశంలో పదేపదే వింటున్నాం. "మధ్యమార్గమంటూ లేనేలేదు" అని లెనిన్ చెప్పిన సుభాషితం ఎంత అమూల్యమైనదో, నేడు దానికెంత ప్రాముఖ్యత ఉన్నదో వేరే చెప్పనవసరంలేదు.

'ప్రతిదీ తనంతటదే అప్రయత్నంగా జరిగిపోతుంది.' అనుకోడాన్ని గురించీ, ఆర్థిక పోరాటమే సోషలిస్టు చైతన్యాన్ని కలిగిస్తుంది అనే సిద్ధాంతాన్ని గురించీ లెనిన్ అతి నిశితంగా విమర్శించాడు. రాజకీయ చైతన్యాన్ని పెంపొందించవలసిన ఆవశ్యకతను గురించి లెనిన్ ఇలా అన్నాడు:

"కార్మికులకు సోషలిస్టు చైతన్యం ఎప్పుడూ బయటనుంచే రావాలి. వారి స్వయంకృషివల్ల ట్రేడుయూనియన్ చైతన్యం మాత్రమే కలుగుతుంది... ఏదేశ చరిత్ర చూచినా, ఇదే మనకు కనబడుతుంది."

—(34 వ పేజీ)

"విప్లవ సిద్ధాంతం లేకుండా విప్లవోద్యమం అంటూ అసలు ఉండజాలదు." —(37 వ పేజీ)

కార్మికవర్గానికి అగ్రగామిగాఉండే పార్టీని ఏయేసూత్రాలపై నిర్మించాలో, ఆపార్టీ ఏయే సూత్రాలపై తన కార్యకలాపాలను కొనసాగించాలో, ఈ గ్రంథంలో లెనిన్ విశదీకరించాడు. ప్రతి కమ్యూనిస్టుపార్టీ సభ్యునికీ ఈ అధ్యాయాలు ఎంతో అమూల్యమైనవి.

తగినంతమంది క్యాడర్లు లభించడంలేదు అనేవారికి లెనిన్ ఈ క్రింది విధంగా సమాధానం ఇచ్చాడు:

"......ప్రజలు అసంఖ్యాకంగా ఉన్నారని చెప్పవచ్చు; లేరనీ చెప్పవచ్చు. ఎందువల్ల అసంఖ్యాకంగా ఉన్నారని అనవచ్చునంటే కార్మికుల్లోనూ, సమాజంలో అట్టడుగునబడి ఉన్న ఇతరవర్గాల ప్రజల్లోనూ అసంతృప్తి నానాటికీ హెచ్చుతోంది. సమాజంలో ఉన్న దుర్భర పరిస్థితుల్ని వారు గొంతెత్తి నిరసించాలని కుతూహలపడుతున్నారు. నిరంకుశ పరిపాలనను కూలద్రోసేందుకు వారు ఏ పోరాటాన్నైనా బలపరచడానికి సిద్ధంగా ఉన్నారు ఇంకా ప్రజలందరూ పరిస్థితుల తీవ్రతను అర్థం చేసుకోలేకున్నప్పటికీ అసంతృప్తి మాత్రం వారిలో నానాట పెరిగిపోతూ ఉంది..."(125 వ పేజీ)

పార్టీ కార్యకలాపాలను కొనసాగించడానికి నూతన శక్తులను, ముఖ్యంగా పారిశ్రామిక కార్మికులను ఏయే పద్ధతులపై కార్యరంగంలోకి కొనిరావాలో లెనిన్ ఇలా సూచించాడు:

"...మన ఉద్యమంలో ప్రత్యేక వ్యక్తులు చేయవలసిన పని ఎంత చిన్నదిగా ఉంటే అంత ఎక్కువనుంది

దాన్ని నెరవేర్చడానికి ముందుకు వస్తారు..." —(126 వ పేజీ)

అఖిలరష్యా రాజకీయ పత్రిక యొక్క ప్రచురణను గురించి వివరించిన అధ్యాయం ఈ గ్రంథంలో అత్యంత ప్రాముఖ్యమైనది. వర్గ పోరాటాన్ని కొనసాగించడానికి కార్మికుల చేతుల్లో అలాంటి పత్రిక ఒక ఆయుధంగా ఉపయోగిస్తుందనీ, అలాంటి పత్రిక ఒక సమిష్టి ప్రచారకుడుగా, నిర్మాతగా పనిచేస్తుందనీ లెనిన్ చెప్పాడు.

పని బాగా ఒత్తిడిగా ఉండడంవల్ల చదువుకోడానికి 'టైము' లేదని 'వాదించడం' తరచుగా నేడు మనం వింటూవున్నాం. ఈ 'వాదన'లో పసఏమీ లేదని ఈ గ్రంథం రుజువుచేస్తోంది. ఇంకా ఎక్కువ బాగా పనిచేయడానికీ, మన బాధ్యతలను మనం సరిగా సక్రమంగా నిర్వహించడానికి, 'చదవడం' సిద్ధాంతాన్ని అధ్యయనంచేయడం అత్యవసరం. ఎందుకంటే 'విప్లవ సిద్ధాంతం లేనిదే విప్లవోద్యమం అంటూ లేదు.'

ఇది ప్రతిఒకరూ తప్పకుండా అధ్యయనం చేయవలసిన గ్రంథం.

***

# రష్యా సమస్య

## (నాటకం)

వెల 1—8—0

మూలం: సిమొనోవ్

అనువాదం: మానేపల్లి తాతాచార్య

ప్రచురణ కర్తలు:

త్రిలింగ పబ్లిషింగ్ కంపెనీ

విజయవాడ

ప్రాప్తిస్థానం: లీలా బుక్ డిపో,

గవర్నరుపేట, విజయవాడ.

ప్రజాస్వామికం అనే ముసుగులో అమెరికాలో నేడు పత్రికా స్వాతంత్ర్యం ఎంత బూటకంగా ఉందో ఈ నాటకంలో చక్కగా నిరూపించబడింది. మేక్ఫర్సన్‌లాంటి పెట్టుబడిదార్లు అనేక పత్రికల్ని తమ చేతుల్లో పెట్టుకొని స్వప్రయోజనాలకోసం యథార్థ విషయాలను ఎలా తారుమారు చేస్తారో ప్రజల్లో ఎలా తప్పుడుభావాలను వ్యాపింపచేస్తారో, సోవియట్ యూనియన్‌పై ఎలా వ్యతిరేక ప్రచారం సాగిస్తారో ఇందులో నిరూపించబడింది.

ఈ నాటకంలో కథానాయకుడైన స్మిత్ తన కడుపే కైలాసం అనుకునే మనిషి కాదు. డబ్బు కాశపడి తన భావాలనూ, తన ఆత్మనూ ఖూనీచేసుకోడు. తన ప్రియురాలు తనను వదలిపెట్టి పోయినా, మిత్రుడు మరణించినా, తాను ఎంత దరిద్రావస్థలోనున్నా, తన ఆశయాన్ని మార్చుకోడు. అమెరికా కుబేరుల వెనక జేరి వాళ్ళతోపాటు రష్యాపై దుమ్మెత్తి పోయడానికి అంగీకరించడు. స్మిత్‌లాంటి నిజమైన ప్రజాస్వామ్య వాదులకూ, మేక్ఫర్సన్‌లాంటి పెట్టుబడిదారులకూ—అమెరికాలో నేడు జరుగుతూవున్న సంఘర్షణను సిమొనోవ్ కళాత్మకంగా, హృదయరంజకంగా వాస్తవికంగా చిత్రించాడు.

ఈ నాటకం నేటి సోవియట్ నాట్యకళా జగత్తులో ఎంతో ప్రధానస్థానాన్ని ఆక్రమిస్తూవుంది. 1946 లో ఈ నాటకానికి స్టాలిన్ బహుమతి లభించింది.

కాని అమెరికా కోటీశ్వరులచేతిలో కీలుబొమ్మలాగా పనిచేస్తోన్న ట్రూమన్ ప్రభుత్వం ఈ నాటక ప్రదర్శనాన్ని సహించలేకపోయింది. రష్యావ్యతిరేక ప్రచారంలోని అసలు బండారాన్ని ప్రజలు గ్రహిస్తారేమో అని ఈ నాటకాన్ని—ఈ ఉత్తమకళాఖండాన్ని నిషేధించి తన నిరంకుశ పెట్టుబడిదారీ ప్రభుత్వ స్వభావాన్ని తానే స్వయంగా రుజువు చేసుకుంది.

మేక్ఫర్సన్‌లాంటి పెట్టుబడిదార్లూ, స్మిత్ లాంటి యథార్థవాదులూ మన దేశంలో కూడా ఎందరో ఉన్నారు. అన్ని దేశాల్లోలాగే మన దేశంలో కూడా ఈ ఉభయులమధ్య సంఘర్షణ జరుగుతూనే ఉంది. కొద్దిమార్పులతో ఈ నాటకకథావస్తువు మన పరిస్థితులకు కూడా వర్తిస్తుంది. కాబట్టి ఈ నాటకం ఆంధ్ర పాఠకులకూ, ప్రేక్షకులకూ ఎంతో ఉపయోగకరంగా ఉంటుందని ఆశిస్తున్నాం.

శ్రీ తాతాచార్యగారి అనువాదం కూడా సాఫీగా నడిచింది. 'ఇంద్రధనుస్సు' అనువాదంద్వారా వీరు మనకు ఇదివరకే పరిచితులు.

ఇలాంటి ఉత్తమ నాటకాన్ని ఆంధ్రుల కందజేసిన 'త్రిలింగ' వారు అభివందనీయులు.

ఆంధ్రప్రజానీకం ఈ నాటకాన్ని పూర్తిగా ఆదరిస్తుందని విశ్వసిస్తున్నాం.

* * *

## ప్రజావిరోధి

(నాటకం)

వెల : 2—0—0

మూలం: హెన్రిక్ ఇబ్సన్

అనువాదం: విద్వాన్ విశ్వం

నవ్యసాహిత్యమాల, అనంతపురం

డాక్టరు సత్యం ఆరోగ్యవనానికి మెడికల్ ఆఫీసరుగా ఉంటాడు. ఈ ఆరోగ్యవనమే పట్టణానికి ఆయువుపట్టుగా ఉంటుంది. తోళ్ళషాపువద్ద కల్మషమంతా నీటి గొట్టాల ద్వారా రిజర్వాయరులోనికి పోతూఉండడం వల్ల నీటి సరఫరా యావత్తూ విషపూరితమై పోవడం, ఆరోగ్యవనంలో క్రొత్త వ్యాధులు వ్యాపించడం జరుగుతుంది. అందుచేత ప్రజాక్షేమం కోసం ఆ నీటి గొట్టాలన్నీ తీయించి వేరేచోట వేయించాలని డాక్టరు సత్యం ఆందోళన చేస్తాడు.

ఈ డాక్టరు అన్నగారైన సుబ్బరామయ్యగారు ఇందుకు వ్యతిరేకిస్తాడు. ఈయన మ్యునిసిపల్ కౌన్సిల్‌కు అధ్యక్షుడు. ఈవిషయాన్ని బైటపెడితే ప్రజల్లో తనకున్న పలుకుబడి పోతుందనీ, ఇది తన ప్రతిష్ఠకు భంగకరమనీ తమ్ముడికి చెప్తాడు. కాని డాక్టరు సత్యం తన అన్నగారి ప్రతిష్ఠకోసమని ప్రజల ఆరోగ్యాన్ని బలిచేయడానికి అంగీకరించడు. అన్నగారి అదిరింపులకూ బెదిరింపులకూ భయపడడు. ప్రజలందరకు తెలియటంకోసం తాను తయారుచేసిన రిపోర్టును ప్రకటించాలని ప్రయత్నిస్తాడు.

ఈ ప్రయత్నంలో 'ప్రజావాణి' పత్రిక ముద్రాపకులూ, సంపాదకులూ పూర్తిగా సహాకరిస్తాం అని మొదట డాక్టరుగారికి వాగ్దానం చేస్తారు. కాని అధికారవర్గం నుంచి ఒత్తిడి వచ్చేటప్పటికి వేషంమార్చి తమ అసలు రంగుతో బైటపడతారు. న్యాయాన్ని తొక్కిపట్టి అధికారులిచ్చిన తప్పుడు ప్రకటననే తమ పత్రికలో ప్రచురిస్తారు. బహిరంగ సభపెట్టి అందులో అధికారవర్గం చేసే కుట్రలన్నిటినీ కుండ బ్రద్దలు గొట్టినట్లుగా చెప్పాలని డాక్టరు ప్రయత్నిస్తాడు. కాని అధికారుల ప్రోద్బలంతో పట్టణంలోని ఏ సంస్థా తన హాలునివ్వదు. చివరకు రామారావు అనే

ఒక నిజాయితీపరుడు మీటింగు పెట్టుకునేందుకు సత్యానికి తన ఇల్లునిస్తాడు. ఇంట్లోజరిగే మీటింగును కూడా అల్లరిచేయడానికి సుబ్బరామయ్య కొందరు త్రాగుబోతులను తయారు చేస్తాడు. మీటింగులో ఎంత అల్లరి జరుగుతున్నా లెక్కచేయకుండా డాక్టరు సత్యం తన భావాలను నిర్భయంగా ప్రకటిస్తాడు.

"శిథిలమై పోతూన్న భావప్రపంచంలో శేషించిన ప్రాచీనవస్తువుల మచ్చుతునకలైన-ఈ పరాన్నభుక్కులు తమ గోతిని తామే తవ్వుకుంటున్నారు. వారి అంతిమ ఘడియలను సమీపింపజేసేందుకు వైద్యసహాయం ఏమాత్రం అవసరంలేదు. అస లిప్పుడు మన సమాజానికి ప్రమాదం చేయగల శక్తి వీరికి లేదు. మన నైతికజీవిత పునాదులనే విషపూరితం చేయడంలో, మన జన్మభూమిని రోగగ్రస్తం చేయడంలో సాధనాలుగా ఉపయోగ పడుతున్నది-ఈ పాతరకం మనుష్యులు కాదు...మధ్య పెట్టి తమ చెప్పుచేతల్లో అధిక సంఖ్యాకుల నుంచుకున్న ముఠా, ఉదార ప్రజాస్వామి కాశయాలున్నాయని చెప్పుకునే వారే 'మన స్వేఛ్ఛా స్వాతంత్ర్యాలకు ప్రబల శత్రువులు."

ఇంత నిర్భయంగా తనభావాలను ప్రకటించినందుకు అధికారవర్గమంతా కలిసి గూడుపుఠాణీచేసి డాక్టరు సత్యాన్ని 'ప్రజావిరోధి'గా తీర్మానిస్తారు.

అధికారవర్గానికీ న్యాయానికీ మధ్య జరిగే యీ పోరాటంలో డాక్టరు సత్యం అనేక కష్టాలకు గురికావలసి వస్తుంది. ఇంటిపై రాళ్ళు పడతాయి. ఇంటియజమాని ఇల్లు ఖాళీ చేయమంటాడు. రౌడీలు చేయిచేసుకుంటారు. డాక్టరుగారి కూతురికి ఉద్యోగం పోతుంది. డాక్టరుగారి పిల్లలను స్కూలునుంచి వెళ్ళకొడతారు. ఆర్థికంగా ఇంకా అనేక ఇబ్బందులను ఎదుర్కోవలసి వస్తుంది.

అయినా డాక్టరు సత్యం సత్యంకోసం న్యాయంకోసం పోరాడుతాడు. "సత్యంకోసం ఎవడైతే నిలబడతాడో అతనే ప్రపంచంలో కంతటికీ మహాబలశాలి." అని ఘోషిస్తాడు.

ఇదే ఈ నాటకంలోని కథాసంగ్రహం. హెన్రిక్ ఇబ్సన్ ప్రపంచ విఖ్యాత నాటకకర్త. ఆయన రచించిన నాటకాలు విశ్వసాహిత్యంలో అగ్రస్థానం అలంకరించాయి. ఇబ్సన్ రచించిన ఇలాంటి ఉత్తమ నాటకాన్ని తెలుగులో అనువదించిన శ్రీ విద్వాన్ విశ్వంగారు ఆంధ్ర పాఠకలోకానికి చిరపరిచితులు. అనువాదం సాఫీగా నడిచింది. ఈ నాటకంలో తెలుగు వాతావరణాన్ని కూడా సమకూర్చి అనువాదకులు దీన్ని ఆంధ్ర దేశంలో ప్రదర్శన యోగ్యంగా చేశారు.

నవ్యసాహిత్యమాలవారు ఇలాంటి ఉత్తమ సాహిత్యాన్ని ఇతోధికంగా ఆంధ్రలోకాని కందజేయగలరని ఆశిస్తున్నాం.

***

## స్వీకారం

### లెనినిజం

రచన: స్టాలిన్

వెల : అర్ధరూపాయి

ప్రాప్తిస్థానం: లీలాబుక్ డిపో

గవర్నరుపేట ; విజయవాడ

స్టాలిన్ వ్రాసిన ప్రోబ్లెమ్స్ ఆఫ్ లెనినిజం అన్న పుస్తకాన్నుండి పద్ధతి, సిద్ధాంతం అను రెండుభాగాలూ అనువదించి ప్రచురించబడినాయి. ఈ సిద్ధాంత గ్రంథం ప్రతివారూ పఠించతగినది.

## కొత్త పత్రికలు:

# జనవాణి

సంపాదకుడు: **తాపీ ధర్మారావు**

(ప్రతి బుధవారం వెలువడు వారపత్రిక)

| | |
|---|---|
| సంవత్సరచందా | 10—0—0 |
| అర్ధ సంవత్సరం | 5—8—0 |
| విడిప్రతి | మూడణాలు |

వివరాలకు:-

"జనవాణి" కార్యాలయం:

మైలాపూరు - మద్రాసు

"జనవాణి" ప్రథమ సంచిక మా కార్యాలయానికి చేరింది. మొదటి సంచికలో 'యథార్థవాది లోకవిరోధి' అన్న శీర్షిక కొడవటిగంటి కుటుంబరావుగారు వ్రాసిన 'దిబ్బరాజ్యంలో అరాచకం' అన్న చిన్నకథ, చైనా కమ్యూనిస్టునాయకుడు మా-సి-యాంగ్ జీవితం, "కదలిక" అన్న శీర్షికక్రింద వారంలో జరిగిన సంఘటనల సారాంశం, అంతర్జాతీయ వార్తలూ ఉన్నాయి.

ఇంకా 'జనవాణి'లో 'కర్ణపిశాచం', 'పొల్లు నెల్లూ' అనే శీర్షికలక్రింద విమర్శలున్నాయి.

సంపాదకులు తమ ప్రథమ సంపాదకీయంలో యిలా తెలియజేశారు.

"కాగడా పట్టుకొని, కల్లాకపటమూ లేకుండా సత్యాన్ని కనపరచడమే మాపని. జంకూ గొంకూ లేకుండా జనవాణిని ప్రకటించడమే మాఉద్యోగం. అన్ని రంగాలలోను ఆంధ్రుల పురోగమానికి పాటుపడడమే మా సూత్రం.

......రాజకీయాలలోనూ, సాంఘికాలలోనూ, సారస్వతంలోనూ - మంచి ఎక్కడున్నా మాకు మంచే. చెడు ఎక్కడున్నా తూర్పారపట్టకమానం. మాకు కావలసింది - సంఘాని కంతటికీ మేలు...... కడుపుకీ, కట్టుకీ ఇబ్బందిలేకుండా ప్రజలందరు సుఖించాలి. స్వాతంత్ర్యం అన్నమాట సార్థకం కావాలి. అర్థంలేని వ్యత్యాసాలూ, అన్యాయమైన విభేధాలూ అంతరించిపోవాలి...... ఇవే మా కోరికలు. వీటికోసమే, శక్తివంచన లేకుండా కృషిచేస్తాము."

"తెలుగు ప్రజలకష్టాలు గట్టెక్కాలంటే తెలుగు దేశంలో నవాబులూ, జమీందార్లూ లేకుండాచేయాలి. తెలుగు గడ్డంతా ఒకటై విశాలాంధ్రలో కష్టజీవుల ప్రజాతంత్ర ప్రభుత్వమేర్పడాలి. అప్పుడే ఆంధ్రప్రజలు అన్ని రంగాలలోనూ పురోగమించడం సాధ్యమౌతుంది.

ప్రజాస్వామిక భావాలను ప్రతిబింబించే పత్రికలే కరువైపోతూవున్న ఈ రోజుల్లో ఇలాంటి ఉదారాశయాలతో ఈ పత్రికలు వెలువరించడం చాలా ముదావహం. మొదటి సంచిక చాలా ఆశాజనకంగా ఉంది.

ధర్మారావుగారు తెలుగుదేశంలో జగమెరిగిన జర్నలిస్టు. పత్రికా నిర్వహణంలో ఎంతో అనుభవంవుంది. వారు తమ పదునైన కలాన్ని అనుభవాన్నీ తమ సంపాదకీయంలో వివరించిన ఆశయాలసాధనకోసం ఆచరణలో జంకూగొంకూ లేకుండా వినియోగిస్తే తెలుగు ప్రజల ఆదరాభిమానాలకు కొదవుండదని విశ్వసిస్తున్నాం.

# నగారా

## ప్రతినెలా 5, 20 తేదీలలో వెలువడే
## పక్షపత్రిక

**ఎడిటర్ : కారుమంచి వెంకటేశ్వర్రావు**

| | |
|---|---|
| సంవత్సర చందా | 9—0—0 |
| అర్ధ సంవత్సర చందా | 4—8—0 |
| విడికాపీ | 0—6—0 |

**కార్యాలయం : మారిస్ పేట–తెనాలి.**

ఈ పత్రిక మొదటి సంచిక మా కార్యాలయానికి చేరింది.

"ఈనాడు తెలుగు ప్రజల మనస్సులను స్తంభింపజేసి, స్వతంత్ర ఆలోచనలను అణచి వేయగలగడానికై 'కమ్యూనిస్టు ప్రమాదం' అనే విషం తయారుచేశారు. దానిని తెలుగు జాతి జీవితంలోకి ఎక్కించడానికి అబద్ధాలు అల్లుతున్నారు..." కాబట్టి "నిజం తెలుపుతూ తెలుగుజాతి అభివృద్ధికి పాటుపడే సుహాశయులకు నగారా జాతీయగీతం వాయిస్తుంది. తెలుగునాటి శత్రువులమీద నగారా నదురు బెదురులేని యుద్ధగీతం మోయిస్తుంది..."

సంపాదకుల ఈ ఆశయం – ఈ ప్రయత్నం నగారాలోని ప్రతి పేజీలో – ప్రతివ్యాసంలో ద్యోతకమవుతుంది.

"ప్రజాతంత్రం అంటే ఏరుకున్న నాయకుని నిరంకుశ పరిపాలన" (పట్టాభిగారి సుభాషితం) లాంటి "వ్యాఖ్య పనిలేని వాక్యాలు" "మాతృప్రేమ" "తమ్ముడిపెళ్ళి" "ఆస్తి రక్షణ" లాంటి చిన్న చిన్న వ్యంగ్య రచనలు. "జయపూర్ కాంగ్రెసు నగరంలో టీ అర కప్పు 8 అణాలు, ఒకపూట భోజనం 4 రూపాయలు" లాంటి "తెలుసుకోదగిన విషయాలు" తెలంగాణాలో జరిగే ఘోరదురంతాలు, "దేవరాజ్యం"లో ఆచార్య కంగారు సంచారం, "కుప్పలకు పిల్లలు" లాంటి హాస్య రచనలు, నీతిని ప్రబోధించే మరికొన్ని 'పిట్ట కథలు' వగైరా శీర్షికలు ఆకర్షణీయంగా ఉన్నాయి.

"కళావేత్తలారా! మీరు ఏ పక్షం" అనేవ్యాసంలో "మీరు అభిమానించి బహూకరించిన ఉత్తమ నాటకాలు (మాభూమి) నిషేధిస్తే......మీరు బృహన్నలలై వీక్షిస్తున్నారా?......కళావేత్తలారా! మీరు "ప్రజానీకంవైపా? పెట్టుబడిదారులవైపా? మధ్యేమార్గం ఏమీలేదు." అని సూటిగా హెచ్చరించారు. 'పత్రికా న్యాయం' అనే నాటికలో బూర్జువా పత్రికల్లో ఉండే కుళ్లు నంతాకడిగి వదిలిపెట్టారు. "కాంగ్రెసు ధృతరాష్ట్రకౌగిలిలో విశాలాంధ్ర సమస్య"లో 'ఆంధ్రనాయకుల బృహన్నల పాత్ర'ను విస్పష్టంగా వివరించారు. 'కలియుగ సైంధవులారా' అనే గేయంలో శ్రీ 'ఆటం' గారు

మీ మిత్రుడు మీ ఆప్తుడు
ప్రజాద్రోహి చాంగ్ కై షేక్
అనుభవాలు స్మరించండి!
గుణపాఠం నేర్చుకోండి!
మానుకోండి వక్రదృష్టి
మార్చుకోండి ద్రోహబుద్ధి
త్వరపడి పొరపడకండి!
పొరపడి చెడిపోకండి!
ఖబడ్దార్! ఖబడ్దార్!

అని హెచ్చరించారు.

ఇలాంటి ముఖ్యమైన రచనలతోపాటు అనేక వ్యంగ్యచిత్రాలుకూడా ఉండడం ఈ పత్రికకు మరింత శోభచేకూర్చింది.

పెట్టుబడిదారీ పత్రికలన్నీ ప్రజలను భావదాస్యానికి బలిచేస్తూ తీవ్రమైన విషప్రచారం

(మిగతా 76 వ పేజీలో)

# జనత

నేటి ప్రపంచ విప్లవశక్తులనుగురించీ, సాంఘికాభివృద్ధికి సంబంధించిన శాస్త్రీయ సూత్రాలనుగురించీ మార్క్సిస్టు దృక్పథంతో పరిశీలించి, ఉద్యమాలలో ప్రత్యక్షంగా పాల్గొన్న అనుభవంతో వ్రాసే విశ్వవిఖ్యాత మార్క్సిస్టుల వ్యాసాలనూ, రచనలనూ అనేక ప్రత్యేక పత్రికలనుండి ఏరి పక్షం పక్షం జనత ప్రచురిస్తోంది.

గ్రంథాలయాలలోనూ, వ్యక్తుల స్వంత లైబ్రరీలలోనూ, ప్రజాసంస్థల కార్యాలయాల లోనూ 'జనత' పత్రిక సంచిక లన్నింటినీ జాగ్రత్తచేసుకొనేందుకు చాలమంది ప్రయత్నించుచున్నారు. వెనకటి సంచికలకోసం - వాటిలోవుండే వ్యాసాల వివరాలను తెలియ జేయమని మా కార్యాలయానికి వ్రాస్తున్నారు. మావద్ద ప్రథమసంచిక తప్ప తతిమ్మా సంచిక లన్నీ కొద్దిగామాత్రమే ఉన్నాయి. కాబట్టి ఫైల్సులోకి సంచికలు కావలసినవారు త్వరపడి ఆర్డర్లు పంపించవలసిందిగా కోరుతున్నాము. వివిధ సంచికల్లో ఇప్పటివరకూ వచ్చిన ముఖ్యవ్యాసాలను పాఠకుల సౌకర్యార్థం యీక్రింద ఇస్తున్నాం.

మేనేజరు జ న త

## సంచిక 1 లో

1. హంగేరి కమ్యూనిస్టు పార్టీలో సిద్ధాంత కృషి.

—మాటియాస్ రాకోసి

2. యుగోస్లావియా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంపై

—కొమిన్‌ఫారం తీర్మానపాఠం

3. చైనా విముక్తి యుద్ధసమీక్ష

4. మార్క్సిజానికి యుగోస్లోవియా కమ్యూనిస్టుపార్టీ స్వస్తి: —వి. లాటు

5. ప్రజల పొట్టకొట్టేందుకు రాబందు లన్నీ చేరాయి. (నోట్లముమ్మరం)

6. ప్రపంచ దురాక్రమణకు అమెరికా ఎత్తులు. —విలియం ఫాస్టర్

ముఖచిత్రం - కారల్ మార్క్సు

## సంచిక 2 1-11-1948

1. యుగోస్లోవియా కమ్యూనిస్టు పార్టీ నాయకుల మార్క్సిస్టు వ్యతిరేకపంథా

—చర్పెంటియర్

2. విముక్తచైనాలో వ్యవసాయసంస్కరణ

—జెన్ పిషి

3. ఆత్మవిమర్శ కమ్యూనిస్టుపార్టీ ప్రధానాయుధం (కొమిన్‌ఫారం సంపాదకీయం)

4. కళా వేత్తలు: కమ్యూనిజం - కొమిన్ ఫారం సంపాదకీయం

5. ఆంగ్లో-అమెరికన్ యుద్ధోన్మాదులు-మిత్రరాజ్యసమితిలో విషిన్‌స్కీ ఉపన్యాస పాఠం

## సంచిక 3 15-11-1948

1. చైనా మహావిప్లవం - సంపాదకీయం

2. భారత కమ్యూనిస్టుపార్టీ నవంబరు దే. ప్రణాళిక

3. ప్రపంచ కార్మికోద్యమంపై డాలర్ కంబంధుని హస్తాలు —సె.కిన్

4. రైతు కార్మికుల్లో పోరాటైక్యత —కొమిన్ ఫారం సంపాదకీయం

5. ఆచరణలో మార్షల్ ప్లాను —ఐ. లపోవ్

6. మార్క్సిజాన్ని ఎలా అధ్యయనం చేయాలి —మా. వియాంగ్

7. కమ్యూనిస్టుపార్టీల బలానికి మూలశక్తి —కొమిన్ ఫారం సంపాదకీయం

8. నేటి సోషలిస్టుల నిజస్వరూపం —కూసినిన్

9. చరిత్రలో ఒక దృశ్యం —జ్యూలియస్ ఫూజిక్

10. ప్రశ్నలు - సమాధానాలు —విలియం ఫాస్టర్

## సంచిక 4 1-12-1948

1. బోల్షివిక్ పార్టీ చరిత్ర చాటిన పరమ సత్యాలు (సంపాదకీయం)

2. వలసదేశాల సమస్య —స్టాలిన్

3. భారత విభజనానంతరం ఇండియా పాకిస్తాన్‌ల స్థితిగతులు —యమ్. అలెగ్జియేవ్

4. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ చరిత్ర మార్క్సిస్టు విజ్ఞాన సర్వస్వం —పి. యూడిన్

5. నేటి వ్యవసాయసమస్య పెట్టుబడిదారీ కార్మికవర్గపంథాలు —విజయ

## సంచిక 5 15-12-1948

1. విప్లవదశ - వ్యూహం (సంపాదకీయం)

2. ప్రపంచ విప్లవశక్తుల సమీకరణ —కామ్రేడ్ మావ్

3. నెహ్రూగారి "మార్క్సిజం"

4. సామ్రాజ్యవాదంలో సంక్షోభం - వలసదేశ ప్రజల పోరాటం —పామీదత్తు

5. శాశ్వత ప్రజాతంత్ర శాంతికోసం సోవియట్ యూనియన్ కృషి —1948 నవంబరు 7 న మాలటోవ్ ప్రసంగం

6. చైనా కమ్యూనిస్టుపార్టీ పునర్నిర్మాణం —రేమాండ్ వాంగ్

## సంచిక 6 1-1-1949

1. జాతుల సమస్య —సంపాదకీయం

2. జాతుల సమస్య —కామ్రేడ్ స్టాలిన్

3. కామ్రేడ్ జదనోవ్ భాష్యాలు

4. కమ్యూనిస్టుపార్టీలో అధ్యయన పద్ధతి —కామ్రేడ్ మా-సి-యాంగ్

5. సోవియట్ సాహిత్యం —ఒలెగ్ మొషెక్‌స్కీ

6. పోలండ్ కమ్యూనిస్టుపార్టీలో మిత వాద జాతీయపోకడలు

—(పోలండ్ కమ్యూనిస్టుపార్టీ తీర్మానం)

7. కమ్యూనిస్టు సమాజ నిర్మాణంకోసం సోవియట్ ప్రజల పురోగమనం

—పి. యాడిన్

8. ఫ్రెంచి ఇండియా సమస్యపై భారత కమ్యూనిస్టుపార్టీ ప్రకటన

## సంచిక 7 15-1-1994

1. సోవియట్ యూనియన్ కు అనుకూలమా? ప్రతికూలమా?

—ఓ. కూసినెన్

2. ప్రకృతి శక్తులపై సోవియట్ సాధించిన మహత్తర విజయం

3. ఫ్రెంచి సాహిత్యం ప్రజాసమరానికి ప్రతిబింబం —వి. నికోలమేవ్

4. బ్రిటిషు సోషలిజంలోని బండారం

—ఎ. లియోనిడోవ్

5. సోషలిజంవైపుకు ప్రజాతంత్ర పోలండ్ పురోగమనం —విజయ

## సంచిక 8 1-2-1949

1. ప్రజాస్వామిక ప్రజాతంత్రం

2. వ్యవసాయ సమస్య

—భారత విప్లవపోరాటం

3. భారతదేశంలో కాంగ్రెసు ప్రభుత్వం

—ఏ. డైకోవ్

## సంచిక 9 15-2-1949

1. నిర్మాణ కృషి

—కొమిన్ ఫారం సంపాదకీయం

2. పెట్టుబడిదారీ విధానంలో తీవ్రతర సంక్షోభం —ప్రొఫెసర్ ఎ. శ్నియర్సన్

3. తెలంగాణావిప్లవం భారతప్రజల కర్తవ్యం.

4. బల్గేరియా కమ్యూనిస్టుపార్టీ 5 వ కాంగ్రెసులో కామ్రేడ్ డిమిట్రావ్ రిపోర్టు

5. బూర్జువా జాతీయత

—కొమిన్ ఫారం సంపాదకీయం

---

(73 వ పేజీ తరువాయి)

చేస్తోన్న ఈ రోజుల్లో నిజమైన ప్రజాస్వామిక భావాలతో, స్వతంత్ర భావాలతో ఈ పత్రికా ప్రచురణకు పూనుకున్న సంపాదకులు అభినందనీయులు.

ఆంధ్రప్రజలు ఈ పత్రికను పూర్తిగా ఆదరిస్తారనీ, ఈ పత్రిక ఆంధ్రప్రజల చేతులలో నాలుకలాగా ఉండగలదనీ ఆశిస్తున్నాం.

***



ఈ పత్రిక సారస్వత పరిషత్తు ప్రత్యేక సంచిక మా కార్యాలయానికి చేరింది.

# ఏజంట్లకు హెచ్చరిక

మావద్ద మీ డిపాజిట్లు లేనిదే పత్రికలు పంపబడవు. మీకు పంపే పత్రికలకు సరిపడే డబ్బైనా కనీసం లేనిదే పత్రికలు పంపబడవు. ఈ రూలును మా కార్యాలయము ఖచ్చితంగా అమలు పరుస్తుంది.

ఏజెంట్లందరికీ వారిడబ్బు యిక్కడ ఎంత వుందో, యింకెంత పంపించవలసి ఉందో, తెలియపరుస్తూ ప్రతిపక్షం జాబులు వ్రాస్తాం. ఏజెంట్లు మాకు పంపించవలసిన డబ్బు ప్రతినెలా 13, 18 తేదీలలోపల అందేటట్లు పంపితేనే మేము సకాలంలో పత్రికలను అందజేయడం సాధ్యమౌతుంది. అదనపు కాపీలు కావలసివస్తే ముందుగానే తెలియపరచాలి.

మీరు డబ్బు పంపేటప్పుడు అడ్రసును, సాధ్యమైనంతవరకు తెలుగులో విడివిడి అక్షరాలతో వ్రాయకోరతాం. ఇంగ్లీషులో అయితే అచ్చు అక్షరాలు వాడాలి. ఈ విషయంలో ఏమాత్రం అశ్రద్ధచేసినా అడ్రసులలో తప్పులుపడి ఇబ్బందులకు కారణమవుతుంది

మావద్ద డబ్బులేనిదే ఎన్ని ఉత్తరాలు వ్రాసినా పత్రికలు పంపబడవనే విషయాన్ని ప్రతి ఏజెంటూ గుర్తించకోరతాం.

మేనేజరు, జనత

---

## ముఖ్యగమనిక

ఏజంట్లు, చందాదార్లు ఉత్తరాలు, మనియార్డర్లు పంపునపుడు వ్యక్తుల పేర్లతో కాకుండా మేనేజరు, 'జనత' అని వ్రాయాలి.

కొంతమంది ఉత్తరములు వ్రాయునపుడు వారి అడ్రసు లేకుండా వ్రాస్తున్నారు. అట్టివారికి జవాబు యివ్వడం కష్టం.

చందాదార్లు పత్రికకు చందా పంపునపుడు తమ అడ్రసు, మనియార్డరు కూపనులో తెలుగులో విడివిడిగా వ్రాయాలి.

ఉత్తరములు వగైరా ఈ దిగువ అడ్రసుకు వ్రాయండి.

మేనేజరు, 'జనత' బకింగ్‌హాంపేట పోస్టు*
విజయవాడ

* బకింగ్‌హాంపేటపోస్టు అనేది వదలివేస్తే ఒకరోజు ఆలస్యంగా చేరతాయి.

BC



# రెండు ప్రధాన సిద్ధాంత వ్యాసాలు

## —: ప్రజాస్వామిక ప్రజాతంత్రం :—

మనం ప్రజాతంత్ర విప్లవదశలో ఉన్నామా? లేక సోషలిస్టు విప్లవదశలో ఉన్నామా? ఈ రోజున మన నినాదం ఏది? శ్రామికవర్గ నియంతృత్వమా? లేక కార్మిక కర్షకుల ప్రజాస్వామిక నియంతృత్వమా? భారత దేశంలోని ప్రజాతంత్ర సంఘటనలో ఏ యే వర్గాలు వుంటాయి? ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యం ఏ యే వర్గాలకు ప్రాతినిధ్యం వహిస్తుంది? ప్రస్తుత భారతపరిస్థితుల్లో పెటీబూర్జువాకు ఏమైనా విప్లవకరపాత్ర ఉందా? ఇవన్నీ—ఈ వ్యాసంలో క్షుణ్ణంగా చర్చించ బడ్డాయి.

## —: భారత వ్యవసాయ సమస్య :—

పారిశ్రామికంగానూ, వ్యావసాయికంగానూ చాల వెనుకబడివున్న వలస, అర్ధవలస దేశాలు రాజకీయంగా, ఆర్థికంగా, సాంఘికంగా ముందుకు పురోగమించాలంటె వ్యవసాయిక విప్లవం తప్పనిసరి అవుతుంది. ఈ వ్యాసం భారత వ్యవసాయ సమస్యను కూలంకషంగా చర్చించి రైతాంగంలోని ఏ యే వర్గం వ్యావసాయిక విప్లవంలో ఏ యే పాత్ర నిర్వహిస్తుందో వివరిస్తుంది. ప్రస్తుతదశలో వ్యవసాయరంగంలో మన ప్రధాన బాధ్యతలను గురించి విస్పష్టంగా తెలియజేస్తుంది.

ఈ రెండు వ్యాసాలనూ ప్రతివారూ తప్పనిసరిగా అధ్యయనం చేయవలసి ఉంటుంది. ఈ రెండు ప్రధాన వ్యాసాలూ ప్రకటించబడిన జనత 8వ సంచిక ఇక కొద్దికాపీలు మాత్రమే ఉన్నాయి. త్వరపడండి.

Edited, Printed and Published by Gangineni Venkateswara Rao, Guntur
Printed at Rasatarangini Press, Vijayawada

